Approved by the Director of Public Instruction.

# హార్డింజిప్రభువు



యం. ఆర్. కృష్ణరావు & కంపెని, నెల్లూరు.

A

సుబోధినీ గ్రంథమాలిక, నెల్లూరు:— నెం. 6

# హార్డింజి ప్రభువు

గ్రంథకర్త
మన్నేపల్లి రామకృష్ణరావు

తృతీయ ముద్రణము

ప్రకాశకులు
యం. ఆర్[illegible]ష్ణరావు & క[illegible]

# Select Opinions

(1) **The Educational Review, Madras**

"This biography of our present Viceroy is in simple and chaste Telugu. The chief incidents in his life are referred to in brief in the opening pages. The rest of the book is devoted to a consideration of the chief questions which have been agitating the public mind in recent years. The author has, in inimitably sweet language shown how the illustrious Viceroy has won the affection and esteem of the people of India committed to his trust. The resolution passed at the last Session of the Indian National Congress praying for an extension of the period of Viceroyalty is referred to. The sad incidents of the death of Lady Hardinge and of her son are in a very touching language presented by the author so as to draw the reader nearer to the Viceroy. This biography aims at showing that the Viceroy is the best of the pro-consuls ever sent out to rule over India. Some of his utterances are translated in flowing Telugu....... School boys will find the book delightful for reading."

(2) **The Hindu, Madras,**

This is a biography in Telugu of our beloved Viceroy. The booklet is written in easy, flowing style. It gives an interesting account of the important events of his life and describes in full his work in India. It is in every way a good book to be placed in the hands of students."

3) **Mr. V. Sayanna Sastry, M.A., L.T., Editor of Prarambha Vidya.**

"The Telugu public is highly indebted to the Sulodhini Granthamala for its Telugu publications in

simple, grammatical and racy style....The latest publication Lord Hardinge is the sixth of this series. It presents all the striking features of his administration, his sympathy for the just aspirations of the Indians and his love for India and its people. We trust it will be widely read by all classes of people. We strongly recommend its supply to all the Elementary Schools. The get up of the book is excellent."

(4) **Mr. G. Subbanna, M.A, B.L., Assistant, A. B. M. High School, Nellore.**

"The Telugu public is under a deep debt to you for this timely publication of the life of 'Lord Hardinge'. It is a surprise to me how you have succeeded in comprising within the small compass of this booklet all that is worth knowing of the great statesman whose administration marks such a brilliant epoch in our History. The style of the book is so simple, direct and chaste that it ought to find its way into the hands of every Telugu Boy."

(5) **Mr. M. Subbarao, M. A., Professor of History, Noble College, Masulipatam.**

"I have gone through the biography of Lord Hardinge written by Mr. M. Ramakrishna Rao. It is written in a simple style with due regard to grammar and accuracy of detail. It will, I hope, be useful in spreading far and wide the knowledge of what our benevolent Viceroy has done for us."

---

# హార్డింజి ప్రభువు జీవితము



## ప్రవేశకము

ఇంగ్లండులో నివసించు హిందూదేశచక్రవర్తిగారికిఁ బ్రతినిధిగ నీ భరతఖండమునఁ బరిపాలనాభారము వహించుటచే (వైస్రాయి) రాజప్రతినిధియనియు, హిందూదేశమందలి వివిధరాష్ట్రములఁ బాలించువారికందఱకు మంత్రివర్గయుక్తముగా నధ్యక్షుఁడై యుండుటచే ససచివ సర్వపాలకాధ్యక్షుఁడనియు (గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్) నీస్థాన మధిష్ఠించినవారికి నామములు. ఈ రాజప్రతినిధి గారికిఁ గొన్ని నిబంధనములకు లోఁబడి మనదేశపాలనా సంబంధముగల సమస్త విషయములందు సర్వాధికారముగలదు. ఆసేతుహిమాలయ పర్యంతముఁ గల యీభారతవర్షమున నివసించు ముప్పది కోటుల ప్రజల క్షేమలాభము లారయ వారే ముఖ్యకర్తలు. ఇంగ్లాండులో మనదేశీయ రాజకీయముల కధ్యక్షులై యుండు రాజమంత్రియు (సెక్రిటరీ ఆఫ్ స్టేటు) నీదేశీయ విషయముల నెల్ల రాజప్రతినిధిగారి యభిప్రాయ ప్రకారమే సాధారణముగా

నడుచుకొందురు. ఆంగ్లేయ సామ్రాజ్యమందలి రాజకీయాధి కారోద్యోగములలో, ఆంగ్లేయ ప్రధాన మంత్రిత్వపదవియు, భరతఖండ రాజప్రాతినిధ్యపదవియు మిక్కిలి ఘనమైనవని చెప్పుదురు. భారతీయులెల్ల రీ రాజప్రతినిధిగారిని ప్రభువుగా భావించి వారేయే స్థలముల దర్శింపవచ్చినను రాజసన్మానముల మనః పూర్వకముగ నొసంగి యాయా స్థలములవారు గౌరవింతురు. భరతఖండము ఆంగ్లేయ సామ్రాజ్యమునం జేరిన దాదిగ నెందఱో రాజప్రతినిధులు మనకుం బాలకులైరి. వారిలోం గొందఱి పరిపాలన మాత్రమే ప్రఖ్యాతిం గాంచినది. ప్రజాభ్యుదయ కరములగు ముఖ్యమార్గముల నవలంబించి నందునను మనదేశముపై ననేక విధముల నెక్కువప్రేమను గనబఱచినందునను, బెంటింక్, క్యానింగ్, రిప్పన్ ప్రభువుల పరిపాలనలు మిక్కిలి ప్రజాను రంజకములైనవిగా సర్వజనాభిప్రాయము. కాని వానికంటె విశేషాంశములతోగూడి శ్రేష్ఠతరమైన పరిపాలన మిప్పటి మన రాజప్రతినిధి యగు శ్రీ హార్డింజిప్రభువుగారి పాలనమేయని నొక్కి వక్కాణింపనగును. ఏవాని పరిపాలనమున చక్రవర్తి సకళత్రపరివారముగా మనదేశమును దర్శించి ప్రాచీనహైందవ రాజులనాఁడు ఇంద్రప్రస్థ నగరమనియు మహమ్మదీయ ప్రభుపుంగవులకాలమున ఢిల్లీనగరంబనియు విఖ్యాతమైన పట్టణరాజంబునం బట్టాభిషిక్తుడై పాలితుల నానందాబ్ధి నోలలాడించెనో, ఏవాని ప్రభు

త్వమున ఢిల్లీనగరము ప్రాచీనౌన్నత్యమును బొంది ప్రసిద్ధపట్ట
ణలలామంబై భారత రాజధానిగా మారెనో, ఏవాని యేలు
బడియందు కర్జన్ ప్రభువుగా రొనర్చిన విభాగంబు కారణం
బుగా నాందోళించుచు రాజ్యాంగ సుస్థితికి భంగంబైన వంగ
దేశంబు మరల నొకటియై శాంతి నొనఁగూడి ప్రజలు సంతు
ష్టాంతరంగులైరో, ఏవాని ప్రభుత్వమున భారతీయ బాలుర
ప్రారంభవిద్యాభివృద్ధికై విశేషముగ ద్రవ్యము వ్యయము
సేయునట్లేర్పాట్లు చేయఁబడెనో, ఏవాని రాజ్యాధికారమున
దక్షిణాఫ్రికాలోఁ జాలకాలము నుండి. బాధలనొందు హైంద
వుల సంకటమును బాపుటకై నిజమైనయత్నములు జరుపఁబడి
కొంతవఱకైన నవి నివారింపఁబడెనో, ఏప్రభువు దుర్మార్గులెట్టి
యకృత్యమును స్వవిషయంబుగా నొనర్చినను శాంతస్వభావ
మును విడనాడక కోపోద్రేకమును సూచించుకార్యములం
జేయక యథావిధిగ కార్యక్రమములు జరపెనో, ఏవాఁడు
పాలకుఁడై యుండఁ బ్రపంచ చరిత్రములో నెన్నఁడును జరిగి
యుండని మహాఘోరసంగ్రామము తటస్థించ, భారతీయుల
రాజభక్తి సూచకములగు సాహాయ్యములు చక్రవర్తిగారంగీ
కరించునట్లు చేయఁబడి భారతీయుల నిర్దుష్టాంతఃకరణము
లాంగ్లేయప్రజల కచ్చెరువగునట్లు తత్క్షణమే తెలుపఁబడెనో,
ఏవాని రాజకీయ పరతంత్రత నాసేతుహిమాచలపర్యంతముఁ
గల హైందవు లెల్లరు మిక్కిలిగ మెచ్చుకొనుచున్నారో, అట్టి

యద్వితీయుఁడు మన హార్డింజి ప్రభువుగారే యనుట ముమ్మాటికి సత్యము.

## వంశావళి

హార్డింజి అను పేరుగల మఱియొక ప్రభువు మన హిందూదేశమున 1844 సం॥ మొదలు 1848 వ సంవత్సరమువఱకు రాజప్రతినిధిగనుండెను. వీరు ప్రకృతమందలి రాజప్రతినిధిగారి పితామహులు. వీరి పాలనము సైతము హిందూదేశమునకుఁ గొంత ప్రయోజన కారిణిగానుండెను. ఒరిస్సా, గంజాము ప్రాంతములలో ఖాండ్లు అను తెగవారిలో నరబలుల నాపుటయు, ఆదివారముఁ ప్రభుత్వకార్యస్థానములకు సెలవుదినముగా నేర్పాటుచేయుటయు, ఈదేశభాషలలో విద్యాభివృద్ధి నొందించుటకై యత్నించుటయు, నీరుపారుదల వసతుల వృద్ధిచేయుటకై గంగానదికాల్వల వృద్ధిచేయ యత్నించుటయు, మొదటి సిక్కు యుద్ధమును, వీరి పరిపాలనలోని ముఖ్యాంశములు. వీరు బాల్యమునుండియు రణవిద్యయందుశిక్షితులై యుద్ధభటులుగఁ ప్రసిద్ధికెక్కినవారు. వీరి కుమారులును మన రాజప్రతినిధిగారి తండ్రియు నగు ఆనరబిల్ చార్లెస్ స్టీవర్డు హార్డింజిగారు తమ తండ్రిగారితోడ హిందూదేశమును దర్శించియుండిరి. తమ తండ్రిగారు పంజాబుదేశమునకు వచ్చినపుడు వారచట విచ్చేసి పంజాబుదేశమునకు సింహాసని ప్రఖ్యాతిగాంచిన రణజిత్ సింగ్ గారి రాజ్యమున జరిగిన ముఖ్యాంశములను తెలియఁజేయుచు

26 చరిత్రాత్మకములగు పటములను (Sketches) వారు వ్రాసి యున్నారు. ఆపటము లిపుడు కలకత్తాయందలి భారతీయ వినోదవస్తు ప్రదర్శనశాలలో శ్రీవిక్టోరియా మహారాజ్ఞిగారి స్మరణచిహ్నముగు సంగణమును (ఇండియన్ మ్యూజియంలోని విక్టోరియా మిమోరియల్ గ్యాలరీ) సింగారించి యున్నవి. మఱియు మన వైస్‌రాయిగారి పెత్తండ్రిగా రొకరు కెప్టెన్ జార్జి నికల్‌సన్ హార్డింజి అనువారు సుమారు 106 సంవత్సరముల క్రిందట సింహళద్వీప సమీపమునఁ బరాసువారి యుద్ధనావలతోఁ బోరాడుచు జయమొనఁగూడుతఱి వీరస్వర్గము నందిరి. పై యంశములవలన నిప్పటి మనహార్డింజి ప్రభువుగారి పూర్వీకులకును, ఈదేశమునకును, తీఱనిసంబంధ ముండెననియు, వారు యుద్ధభటులుగను, రాజ్యకార్య దురంధరులుగను వన్నె కెక్కినవారనియు స్పష్టమగుచున్నది.

## జననము—విద్యాభ్యాసము

అట్టిసద్వంశమున మన వైస్‌రాయ్‌గారు 1858 వ సంవత్సరము జూన్ నెల తే 20 దిన జననమందిరి. హిందూదేశ చరిత్రలో నీ సంవత్సర మెంతయు ముఖ్యమైనది. ఈసంవత్సరమే, యంతకుఁ బూర్వవత్సరమున హిందూదేశమున నారంభింపఁబడిన, దేశీయభట మహాసంక్షోభము (గ్రేట్ యిండియన్ మ్యూటిని) నణచివేయుటవలన దేశమునకును బ్రజలకును శాంతిగలిగెను; కంపెనీవారి ప్రభుత్వమును నిలుపుదలచేసి శ్రీమద్వి

క్టోరియా మహారాణిగారు హిందూదేశప్రభుత్వమును స్వపరిపాలన క్రిందికిఁ జేర్చుకొనిరి; నవంబరు నెల 1 తేదిన హైందవుల స్వాతంత్ర్యములకు జీవాధారముగ నెన్నఁబడు శ్రీమహారాణిగారి మహావాగ్దాన ప్రకటనము పాలకులచే హిందూదేశమునందంతటఁ బ్రకటింపఁబడినది. కాన హిందూదేశీయులకు సంతోషావహ మైనట్టియు, మఱువ నశక్యమైనట్టియు 1858 వ సంవత్సరమె హార్డింజిగారి జన్మకాల మగుట యెంతేయు సమంజసము. బాలుఁడు దినదిన ప్రవర్ధమానుఁడై క్రమముగ విద్యాభ్యాసమునఁ బ్రవేశించెను. హారోపట్టణమందలి పాఠశాలలో గొంతకాలమును, కేంబ్రిడ్జిలోని ట్రినిటీ కళాశాలయందు కొంతకాలమును బఠించి జయప్రదముగ వీరు విద్యను సంపూర్ణము గావించిరి.

## ఉద్యోగ ప్రవేశము

తదనంతరము 1880 వ సంవత్సరమున అనఁగా 22 వత్సరముల ప్రాయమున నుండఁగాఁ నేదేని యొక యుద్యోగమునకై యత్నించి, తుదకుఁ బ్రభుత్వసేవలో రాజకార్యమండలిం (Diplomatic Service) బ్రవేశించిరి. రాజ్యవ్యవహారములలో నొక రాజ్యమువారికిని మఱియొకరాజ్యమువారికిని గల సంబంధముల విషయమై రాయబారముల నడపుచు కార్యములనత్యుపాయముతోడను, బుద్ధికుశలతతోడను జరుపుచుండు శాఖయే యీ రాజకార్యమండలి. ఇందు మిక్కిలి కుశాగ్రబుద్ధిగల

వారును ఉన్నతవంశజులై కుటుంబగౌరవమును నిల్పుకొను వారు మాత్రమే నియోగింపఁబడుదురు. అట్టి రాజ్యాంగ శాఖో ద్యోగములో హార్డింజిగారు చేరి 1882 వ సంవత్సరమునఁ దత్కార్యస్థానమున మూఁడవ కార్యదర్శిగా నియోగింపబడిరి. అక్కడ పని విశేషము గనుక లోపము లేకుండ నన్ని కార్యములు త్వరితముగా జరుగుచుండుటకై యొక్కొక విధమైన పనికి యొక్కొక ముఖ్యాధికారి యుత్తరవాదియై యుండును. వారికి (సెక్రిటరీలు) కార్యదర్శులు అనిపేరు. ఆకార్యదర్శులలో వారివారిపనికిఁ దగినట్లుగా జీతములు హెచ్చుతగ్గులై యుండును. హార్డింజిగారు మూఁడు సంవత్సరములు మూఁడవ కార్యదర్శి పదమందుఁ బనిచేయఁగాఁ బైయధికారులు వారి నైపుణ్యమునకు మెచ్చుకొని 1885 వ సంవత్సరమున రెండవ కార్యదర్శి స్థానము రిక్తపడినపుడు హార్డింజిగారి నాయుద్యోగమున నియోగించిరి. వారు తమవిధాయక కృత్యముల నతి శ్రద్ధాభక్తులతో నిర్వర్తించుచు, నేదిన కార్యక్రమ మాదిన మననే సాధ్యమైనంతవఱకుఁ బూర్తిచేయుచు, తన క్రిందివారి పై నెంతయో దయఁగలిగి మెలంగుచు నందఱి సంప్రీతిఁబడయు చుండిరి.

## వి వా హ ము

హార్డింజిగారు 1890 వ సంవత్సరమున, అనఁగా వారు 32 వత్సరముల ప్రాయముననుండఁగా, తమ కంటె పది వత్సర

ములు చిన్నదియగు మిస్‌విన్నిఫ్రెడ్ స్టర్డ అను యువతీమణిని పరిణయమాడిరి. ఈయమ మొదటిబేరన్ అలైంటన్‌గారి కుమారిక, మిక్కిలి రూపవతి, సద్గుణవతి. ఆయమ గొప్ప వంశమున జనించినదగుటవలనను, తెలివితేటల వన్నె కెక్కినదగుటను, అలెగ్జాండ్రా మహారాణిగారామెను 1893 వ సంవత్సరమున తమయభ్యంతరగృహ కార్య నిర్వాహకలలో (Bed chamber women) నొకర్తెగ నేమించిరి. ఆకారణమున నామె రాజనగరులలో గౌరవస్థానము నాక్రమించి గణన కెక్కెను. ఆయమకు వివాహమైన రెండు వత్సరములకు అనఁగా 1892 వ సంవత్సరమునఁ బ్రథమ పుత్రుఁడు జనించెను. కడపట 1900 వ సంవత్సరమున కుమారిక జనించెను.

## అండర్ శెక్రిటరీ పదవినందుట

హార్డింజిగారు 1896వ సంవత్సరమువరకుఁ బైనఁ బేర్కొనఁబడిన కార్యదర్శిస్థానమున నుండిరి. ఆసంవత్సరము సాలిస్‌బరీదొరవారు వీరిని పెరిషియాదేశమునకు రాయబారిగనంపిరి. అప్పుడు తనకుఁ గలిగిన యనుభవమును గురించియు, హిందూదేశముయొక్క విదేశ రాజనీతిని గురించియు, హార్డింజిగారిట్లు చెప్పియున్నారు:—"నేను 1896 వ సంవత్సరమున శాలిస్‌బరీదొరవారిచే పెరిషియాదేశమునకుఁ బంపఁబడినపుడు, అక్కడ బ్రిటిష్‌రషియా ప్రభుత్వములవారు, పెరిషియా మధ్యాసియాదేశములలో నవలంబించెడి తెలివిమాలిన పోటీలను గురించి

నాకు బ్రథమమునఁ దెలియనయ్యెను. ఈ పోటీలవలన వారిరువుర కును,హిందూ దేశమునకును రాజకీయాది ముఖ్యవిషయములలో నష్టము కలుగుటయే కాక యేదేశముల గుఱించి వీరీ వివాద ములఁ బెట్టుకొనియుండిరో, ఆదేశముల వాణిజ్యము పరిపాల నము సహా యభివృద్ధినొందుట కవకాశము స్వల్పమైనది. నేను పదునెనిమిది మాసములు టెహరాన్ (పెరిషియా ముఖ్యపట్ట ణము)పట్టణముననుండి యంతట యచ్చోటువాసి సెంట్ పీటర్సు బర్గు (రషియా ముఖ్యపట్టణము) నకు వెళ్ళితిని. బ్రిటిష్ వారి యొక్కయు రష్యావారియొక్కయు పెరిషియా మధ్యాసి యాలోని ప్రతినిధుల కుతంత్రములవలననే ఐరోపాఖండము నకు శాంతికలుగక యుండుటను నేనచ్చట చేరిన శీఘ్రకాల ములో గమనించితిని. ఈ యశాంతివలననే సేనకై విశేషద్ర వ్యము హిందూదేశపు వరుంబడినుండి వ్యయమగుటను గని పెట్టితిని.” ఈ విధముగ హిందూదేశమునకును విదేశములకును గల రాజ్యాంగనీతి సంబంధమగు సంగతులు కొన్ని వీరికిఁ జాల కాలమునుండియుఁ దెలిసియుండెను. రష్యాప్రభుత్వము వారి కిని, ఆంగ్లేయ ప్రభుత్వమువారికిని, కొన్ని యొడంబడికలు కుదుర్చుటయందు హార్డింజిగారు పరిశ్రమచేసి సఫలీకృత మనో రథులైరి. 1898 వ సంవత్సరము మొదలు 1903 వ సంవత్స రము వఱకు వారు రష్యా ముఖ్యస్థానమగు సెంట్ పీటర్సుబర్గు పట్టణమున రాయబారిగ నుండిరి. 1903–04 సంవత్సరములలో,

ఇంగ్లాండులో విదేశవ్యవహారముల కార్యస్థానమున (అండర్ శెక్రిటరీ) ననుగత సాహాయ్యకార్యదర్శిగానుండి వారు విదేశీయ రాజకార్యముల నిర్వర్తించుచుండిరి. అంతట వారు 1904—06 సంవత్సరములలో సెంట్‌పీటర్సుబర్గులో ఆంగ్లేయ రాయబారిగానుండిరి. అనంతర మిదివరలో వారు నిర్వర్తించిన ననుగతకార్యదర్శి పదవిని స్థిరముగ నాలుగు సంవత్సరములు నిర్విఘ్నముగ నిర్వహించిరి. ఆస్థానమున నుండుటచేఁ బెక్కు పలనా విషయములఁ దనకౌశల్యము నాంగ్లేయ మంత్రులకు స్వయముగా నెఱిఁగించుట కనేకావకాశములు వారికిఁ దటస్థించుచుండెను. అపుడు విదేశ రాజ్యాంగ కార్యాలయమున ననేక విధములగుమార్పు లాస్థానమున వీరి పూర్వాధికారులై యుండిన శాండర్సన్ ప్రభువుగారిచేఁ దలపెట్టఁబడి యుండుటవలన మన హార్డింజిగారా మార్పుల నన్నియు నాచరణలోఁ బెట్టి తత్కార్యాలయమునకు నూతన జీవనము నిచ్చిరి. మఱియు నా మార్పులవలన నితరులకు నొప్పి కలుగకుండ మిక్కిలి యుపాయముతోఁ గార్యముల నెఱవేర్చి వారు ప్రజల సన్మానమునకుఁ బాత్రులైరి.

## హిందూదేశరాజప్రాతినిధ్య నియోగము

పైనఁ జేర్కొనఁబడిన యంశములవలన మన రాజప్రతినిధిగా నిచ్చుటకు విచ్చేయుటకుముందు 1880వ సంవత్సరము మొదలు 1910 వ సంవత్సరమువఱకు అనఁగా ముప్పది వత్సర

ములు విదేశవ్యవహారములలో నారితేరి ప్రవీణులని ప్రఖ్యాతిం గాంచినటులు తెల్లమగుచున్నది. కీర్తిశేషులగు శ్రీ సప్తమైడ్వర్డు చక్రవర్తిగారును మన సర్ ఛార్లెస్ హార్డింజిగారియందు మిక్కిలి యభిమానము కలిగియుండి విదేశరాజ్యాంగ విషయముల నప్పుడప్పుడు వీరితో వారు ముచ్చటించుచుండిరి. మఱియుఁ దమవెంట వారింగొనిపోవుచు విదేశములకు వెళ్లుచుండిరి. తమ తండ్రిగారి కట్టి యభిమానము హార్డింజిగారి యందుఁ గలదనియు, హార్డింజగారు మొదటి నుండియు మంచి నడవడికయు ప్రభుభక్తియుఁ గలిగి వర్తించిన రాజకీయోద్యోగియనియు మన ప్రభువుగారగు శ్రీ ఐదవజార్జి చక్రవర్తిగారికి రూఢిగాఁ దెలియును. మఱియు నాంగ్లేయమంత్రులును, వీరికి చిరపరిచయులు.

1910 వ సంవత్సరాంతమున మింటోప్రభువుగారి హిందూదేశరాజప్రతినిధిత్వముయొక్క నియమితకాలము ముగియునుగాన వానిస్థానమున నెవ్వరిని నియమించవలయునా యను చర్చ ఆంగ్లేయ పత్రికలలోఁ బ్రారంభమయ్యెను. అనేకమంది ప్రముఖులపేర్లు ప్రజలచేతను పత్రికలచేతను పేర్కొనఁబడుచుండెను. కొందఱు కిచనర్ప్రభువుగారి కా పదవినిచ్చిన వారు చక్కఁగా నిర్వహించుదు రనిరి. కొందఱాయభిప్రాయము సరికాదనియు నుదారభావములు గలిగి రాజ్యపరిపాలనావిధానములఁ జక్కఁగ నెఱింగినవారిని నియమించవలెననియు, జీవిత

మంత్రియు క్షేత్రమునందు గడపిన కిచనర్ ప్రభువుకన్న మఱి యొకరిని బేర్కొనుట మంచిదనియు నుడివిరి. కాని మనహార్డింజిగారి పేరు మాత్రము విశేషముగ నెవ్వరుఁ బ్రశంసింపలేదు. 1910 వ సంవత్సరము ఫిబ్రవరి నెల తే 15 దిన "ఇండియన్ టైమ్సు" అను వార్తాపత్రికలో నొక విలేఖకుఁడు సర్ చార్లెస్ హార్డింజిగారికి రాజప్రతినిధిత్వపదవి నిచ్చిన బాగుగనుండునని వ్రాసెను. ఇదియే వారిని గుఱించిన ప్రథమ ప్రస్తావనము. వారిపేరు ప్రస్తావనకు రాఁగా విని కొందఱు వారి గుణగణముల విమర్శింపఁదొడగిరి. రాజుగారును మంత్రులును ఆలోచించి, హార్డింజిగారి యభిప్రాయమును గనుగొని, నాతనియందే రాజ ప్రతినిధిత్వభారమును నివేశింపఁ జేయదలచి, 1910 సం-రం॥ జూన్ నెల తే 10 దిన సర్ చార్లెస్ హార్డింజిగారిని మింటోప్రభువుగారి యనంతరము హిందూదేశ రాజప్రతినిధిగా నియమించితిమని శ్రీచక్రవర్తిగారు ప్రకటించిరి. ఈవార్త ఇంగ్లాండు మున్నగు దేశములలో తత్క్షణమే వార్తాపత్రికలలోఁ బ్రకటింపఁబడెను. ఆంగ్లేయదేశములోని పత్రికలలో ననేకము వారి నియామకము నంగీకరించినవి కాని కొన్నిటిలో మాత్రముహార్డింజిగారు కాన్సర్వేటివ్ (మార్పులకిష్టములేకపూర్వాచారములనే యవలంబించుచుండవలెనని పక్షమువారు) కుటుంబము వారు గాన మింటో మార్లీ ప్రభువుల పరిపాలనలో జరిగిన సంస్కరణల నాయన యుదారభావముతో నాచరణములోఁ

బెట్టఁజాలఁడనియు, వారి సోదరుఁడగు లార్డుహార్డింజిగారు కెంట్ దేశములోని యూనియనిస్టు పక్షము (ఐర్లండు కేనియు స్వపరిపాలనమీయక సర్వపాలనాధికార మాంగ్లేయాధీనమై యుండఁ గోరువారు) వారి కధిపతియనియు, హిందూదేశమును గురించి హార్డింజిగారి కేమియుఁదెలియదనియు, వారికన్న మరియొక యనుభవశాలి కా పదవి నిచ్చిన బాగుగనుండెడిదనియు విరోధాభిప్రాయములు ప్రకటింపఁబడెను. ఇట్లభిప్రాయపడినవారు బహుస్వల్ప సంఖ్యాకులు. హార్డింజిగారికి హిందూదేశ విషయములు ముందుగాఁ దెలియకపోవుటయే మంచిదనియు, కాన్సర్వేటివ్ పక్షమునగాని లిబరల్ పక్షమునగాని యంతవఱకు జోక్యముకలిగించుకొనని వారగుటచే నిష్పక్షపాతబుద్ధితో కార్యములనారసి న్యాయప్రకారము జనసమ్మతముగఁ బాలన చేయుదురనియు, వారి పూర్వులకాలమునుండియు హిందూదేశమునకును వారి కుటుంబమునకును సంబంధము గలదు కాన సహజముగ హిందూదేశముపై వారికెక్కువ యభిమానము కలదనియు, టర్కిష్, రషియన్, పెర్షియన్ భాషల నెఱిఁగియుండుటచే స్వదేశ సంస్థానాధిపతులతో నాయాభాషలయందు ముచ్చటించి వారిహృదయముల గుర్తెఱుఁగ గలుగుదురనియు, విదేశరాజ్యాంగ రాయబారమున నేర్చుకొనిన వివిధోపాయములును, ఓర్పును, జాగరూకతయు హిందూదేశ రాజప్రతినిధిగ నెక్కువ సహాయ కారులగు

ననియు, ఆంగ్లేయపత్రికాధిపతులు దీర్ఘవ్యాసముల వ్రాసి రాజుగారి నియామకము సర్వజనాంగీకారమే యని ప్రకటించిరి. అందునకు రాజమంత్రులును సంతోషించిరి. తర్వాత ఆగస్టునెల 2-వ తేదిన సర్ హెన్రీహార్డింజిగారికి 'బేరన్ హార్డింజి ఆఫ్ పెన్ హర్సుట్' అను గౌరవబిరుదమును శ్రీ అయిదవ జార్జి చక్రవర్తిగారొసంగి వారిని ప్రభువుగాఁ జేసిరి. నాటి నుంఢియు సర్ చార్లెస్ హార్డింజిగారు 'లార్డుహార్డింజి' అని పిలువఁబడుచుండిరి. మఱియు శ్రీచక్రవర్తిగారు వారికి అక్టోబరు నెల తే 12 దిన మార్లబరో భవనమున దర్శన మొసంగి జీ. సీ. ఐ. ఇ., జీ. సీ. యస్. ఐ. అను ఘనమగు బిరుదములనిచ్చి వారిపై శ్రీవారికిఁగల సదభిప్రాయముల నెల్లడించిరి. హార్డింజి ప్రభువుగారి స్నేహితులును బంధువులును అభిమానులును వారి వారి సంతోషములఁ దెలుపుచు విందులు వేఁడుకలు చేసి హార్డింజిగారిని గౌరవించిరి. అక్టోబరు నెల తే 20 దిన లండను నగర రాజమున శాల్బరీ హోటల్ భవనమున "కెంట్ కౌంటి" నివాసస్థులందఱును జేరి తమ కౌంటి వాసస్థులగు హార్డింజి గారికి హిందూదేశపు రాజప్రతినిధిపదవి లభించినందులకు తమ సంతోషమును వెలిబుచ్చుచు గొప్ప విందుఁ జేసిరి. అపుడు కెంట్ లార్డు లెఫ్టినెంట్ గారగు కాండన్ ప్రభువుగా రగ్రాసనాధిపత్యము వహించిరి. అనేకులు ప్రభువులును, పార్లమెంటు సభ్యులును, సమావేశమైరి. 1500 మంది ప్రముఖులు చేవ్రాలు చేసిన యభి

నందన పత్రమును శ్రీ హార్డింజి ప్రభువుగారి కర్పించిరి. హార్డింజి ప్రభువు వారి స్వాగతమునకుఁ తన కృతజ్ఞతను దెలుపుచు నుచితవాక్యంబుల నుపన్యసించిరి. ఇదియే వారు రాజప్రతినిధి పదవి నంగీకరించినపిమ్మట నొసంగిన ప్రథమోపన్యాసము. ఆ యుపన్యాసమున హిందూదేశ విషయములఁగొన్నిటిఁ బేర్కొని, యీ గొప్పఖండమునఁ దనకుఁగల యభిమానమును వెల్లడించిరి. హిందూదేశీయు లాయుపన్యాసమునుబట్టి హార్డింజిప్రభువు పరిపాలనము ప్రజానురంజకముగనుండు ననుటకు సూచనలు గలవని విశ్వసించిరి. ఇవి యను జరిగిన నాలుగు రోజులకు హారో పట్టణవాసులు మఱియొక విందుఁ జేసిరి. ఈ హారోపట్టణము ననే వారు విద్య నభ్యసించిరి. కాన నచ్చటి స్నేహితులును, తోడి విద్యార్థులై యుండినవారును, ఘనముగా నొకవిందుఁజేసి స్వాగతోపన్యాస మొసఁగిరి. అందునకుఁ బ్రత్యుత్తరముగా హార్డింజిగారు, తమ కుపన్యాసము నిచ్చుటయందిష్టము లేక పోయినను విధిలేక ప్రత్యుత్తరమీయవలయుఁగానఁ దనకుఁ దోచు మాటల నుడివెదననియు, ఇంగ్లాండులో హిందూదేశ విద్యార్థులస్థితి చాల శోచనీయముగా నున్నదనియు, ప్రభుత్వము వారా విషయమును బాగు పఱచుటకై చేసిన యేర్పాటులు చాలవనియు, ఆంగ్లేయులును హైందవులును, కలసిమెలసి పాఠశాలలలో వర్తించుచుండిన, హైందవ విద్యార్థులు దుర్మార్గములంబడక చక్కఁగ నడచుకొందురనియు, హిందూదేశ

మును గనికరముతోఁ బాలించుచుండిన నేవిధమైన యసం తృప్తియు లేక ప్రజలు రాజభక్తిపూరితహృదయులై యుందు రనియు, వక్కాణించిరి. పైనఁ బేర్కొనఁబడిన రెండు విం దులు కాక విదేశ రాజ్యాంగ మంత్రివర్గమువారు సర్వైశ్వర్య గ్రేదొరవారియాధిపత్యము క్రింద నొక విందుఁ జేసిరి.

## హిందూదేశ ప్రయాణము

ఈ విధమున నాంగ్లేయ ప్రముఖుల యభినందనముల నంది, నవంబరు నెల తే ౹౪ ది. హిందూదేశమునకుఁ బ్రయాణము సేయ నిశ్చయించుకొనిరి. ఆ మరుసటి దినమున శ్రీజార్జి చక్ర వర్తిగారు హార్డింజిగారికి తంత్రీవార్తనంపి వారిప్రయాణము సుఖదాయకముగ నుండుగాకయని యాశీర్వదించిరి. ప్రయాణ దివసమున హార్డింజి ప్రభువును వీడ్కొనుటకై మార్లేప్రభువు మున్నగు గొప్పగొప్ప మంత్రులును, ఇతరప్రముఖులును విక్టో రియా స్టేషను వద్దకు విచ్చేసిరి. పొగబండి సాగుసమయమున నొక విశేషాంశము సంభవించెను. హార్డింజి ప్రభ్వియుఁ బరి వారమును బండెక్కిరిగాని హార్డింజి ప్రభువు మాత్రము తమ స్నేహితులతో మాటాడుచు సెలవుగైకొనుచు బండికదలు టను గమనించరైరి. బండికదలెను. అంతవారెగిరి బండిలోఁ గూర్చొన యత్నించిరికాని రైల్వే యధికారులు నివారించి, కూఁతవేసి, బండిని నిలిపి, వారిని సాగనంపిరి. ఈ విధముగ నదృష్టవశమున నేలాటివిఘ్నములు లేక ప్రయాణము సాగెను.

డోవరు రేవుపట్టణము వఱకు వారి రెండవ కుమారులు ఆనర బిల్ ఏ. హెచ్. హార్డింజిగారు వచ్చి జననీజనకుల సెలవంది మఱలి వెళ్లిరి. ఈ బాలుఁడు ఇంగ్లాండునవనే విద్య నేర్చుకొనుచుండెను. హార్డింజిగారి కుమారికయగు డైమండ్ హార్డింజిగారు జననీజనకులతోడ హిందూదేశమునకు వచ్చిరి. వారు పయనమైన 'పెరిషియా' యను మెయిలుస్టీమరులో గొప్ప హైందవాంగ్లో ద్యోగీయులుండిరి. వారందఱు రాజప్రతినిధిగారికిఁ బరిచయులైరి. వారితోముచ్చటించుచును, గ్రంథములు వార్తాపత్రికలు పఠించుచును రాజప్రతినిధిగారు స్టీమరులోఁ గాలము గడుపుచుండిరి. స్టీమరు ఏడను రేవునొద్ద కొంతకాల మాగెను. హార్డింజిగారుగట్టుకు వెళ్లి యచ్చటి యుద్యోగీయుల స్వాగతములనంది స్థలవిచిత్రములను, కోటలను బరిశీలించి మరల స్టీమరెక్కిరి.

## బొంబాయి ప్రవేశము

స్టీమరక్కడినుండి బయలుదేరి 1910 సం॥ నవంబరు నెల తే 18 ది ప్రాతఃకాలమున 8 ఘంటలకు బొంబాయి రేవు చేరెను. బొంబాయి గవర్నరుగారు రాజప్రతినిధిగారి నెదుర్కొని స్వాగత మిచ్చిరి. సాధారణముగ బొంబాయి గవర్నరుగారు ప్రతి రాజప్రతినిధిగారికిని దమ యధికార కార్యస్థానమనునే (గవర్నమెంటు హౌస్) స్వాగతమిచ్చు నాచారముకలదు. కాని, గవర్నరుగారు, స్వయముగా నౌకాశ్రయ స్థానమునకే

వెళ్లి హార్డింజిగారికి స్వాగతమిచ్చుట యొకవిశేషగౌరవముగ నెన్నబడెను. బొంబాయి పౌరులు సురుచిర మంటపముల నిర్మించి యందు శ్రీరాజప్రతినిధిగారికి విజ్ఞాపన పత్రికల సమర్పించుకొనిరి. అందుకు హార్డింజగారు తగిన ప్రత్యుత్తరమిచ్చి గవర్నరుగారి విడిదికి వెళ్లిరి. బొంబాయిలోని కొన్ని ముఖ్యస్థలములం దర్శించి వారు కలకత్తా నగరమునకుఁ బయనమైరి.

కలకత్తా ప్రవేశము-సింహాసన స్వీకారము

హార్డింజగారు నవం [illegible] దిన కలకత్తా చేరిరి. కలకత్తా హిందూదేశమునకు ము[illegible]ణముగను రాజప్రతినిధిగారి వాసస్థానముగను [illegible] నా నగర ప్రాముఖ్యమునకుఁ దగిన విధమున హార్డి[illegible] ప్రభువుగారికి పౌరులు స్వాగతమిచ్చిరి. అపుడు హిందూదేశ రాజప్రతినిధిగా నుండిన మింటో ప్రభువుగారు నూతన రాజప్రతినిధి గారికి గొప్పవిందుఁ జేసిరి. మింటో ప్రభువుగారు హార్డింజగారికి రాజప్రతినిధిత్వము నప్పగించి కలకత్తానగరమును దగువైభవముతో వదలిరి. మింటో ప్రభువుగారి పరిపాలనయుఁ జాలవఱకుఁ బ్రజానురంజకముగనే యుండెను. కాని వారి పిడ్కోలు హైందవులకుఁ గొంచెము విచారకరముగనుండెను. మింటో ప్రభువుగారును హిందూదేశమును, చిరకాల స్నేహితులను వదలునపుడు చింతిల్లిరి. మింటోగారు కలకత్తా నగరమును వదలఁగనే హార్డింజి ప్రభువు రాజప్రతినిధి స్థానము నధిష్ఠించిరి. జరుగవలసిన

మర్యాదలు జరిగిన పిమ్మట నియమప్రకారము రాజప్రతినిధిత్వ పదవిని స్వీకరించి స్వగృహమున కేగిరి.

## ప్రారంభ దివసములు

నాటినుండియుఁ బ్రతిదినము స్వదేశసంస్థానాధిపతుల రాకపోకలతోడను, విందులతోడను, అభినందనపత్రికలనంది ప్రత్యుత్తరము లిచ్చుటతోడను, గొప్పగొప్ప ప్రముఖులకు దర్శనము లొసంగుటతోడను, నగరము నలుపార్శ్వముల వీక్షిం చుటతోడను ప్రశాంత [illegible] ర్డింజి ప్రభువు గారు గడపుచుండిరి. వారు ప్రథమమున మిక్కిలి వైభవముతో నగరముఁ బ్రవేశించఁగా నదివఱ కెన్నడు రాజప్రతినిధిగారి కంతటి వైభవము జరిగియుండలేదని కొందఱు ప్రజలు తలంచిరి. కాని యావైభవము హార్డింజి ప్రభువుగారాసించి నది లేదు. పురప్రవేశమైన మరుసటి దివసమునుండి వారి ప్రవర్తనమును గమనించినవారికి వారి యదాంభికత్వమును, నిగర్వమును దెల్లమై, విస్మయము కలిగించెను. పరివారమునంతయు వదలి యొంటరిగా వారు నగర వీధులలోఁదిరిగి స్వయముగాఁ బ్రజల స్థితిగతుల విచారింపఁ బ్రారంభించిరి. డాంబికములగు బహిరంగ వేషములయందు వారికిష్టము లేదనుట కొక నిదర్శనము:—బర్డ్వాను మహారాజుగారు రాజభక్తిని స్థిరముగాఁ బ్రజలలో నెలకొల్పుటకును, రాజ ద్రోహాభిప్రాయముల నంత మొందించుటకును, సంఘముల నేర్పఱ్చి కృషి

చేయవలెనను నుద్దేశ్యముతో 'సామ్రాజ్య సంఘ' మను పేర నొక సంఘమును స్థాపించిరి. ఆయుద్దేశ్యములఁ గొనసాగించుటకై యెన్నియోవిధముల నుద్యమింతుమని ప్రకటించిరి కాని వారేమియు చేసినవారుకారు. వారుచేసిన కార్యమొక్కటి మాత్ర ముండెను:—నూతన రాజప్రతినిధిగా హిందూదేశమునకు విచ్చేసిన వారి కభినందన పత్రికల నర్పించుటయు, నియమితకాలము ముగిసిన రాజప్రతినిధిగారికిఁ దమ వందనము లర్పించుటయు, [illegible] ప్రభువుగారికిని విజ్ఞాపన పత్రిక సమర్పించిరి. దానికిఁ బత్యుత్తరమిచ్చుచు హార్డింజి ప్రభువుగారు "వెళ్లు రాజ ప్రతినిధులకును, వచ్చు రాజప్రతినిధులకును అభినందన పత్రిక లందించుటయందు మాత్రమే మీయత్నముల వినియోగింపక, సార్థక విషయములలోఁ బని చేయుదురని నానమ్మకము" అని చెప్పి బర్డ్వానురాజుగారి డాంబిక సంఘమును నిరసించినట్లు సూచించిరి. వారి మాటలవలన డాంబిక వేషధారులకు జంకు గలిగి కపట ప్రవర్తనలు తగ్గెను.

### కాంగ్రెసు ప్రతినిధులకు దర్శనము

వారు రాజ ప్రతినిధిత్వభారము వహించిన దాదిగ హిందూదేశమునకు సంబంధించిన ప్రతివిషయమును శ్రద్ధతో నేర్చుకొనుట యందును, స్వదేశ సంస్థానాధిపతులవలనను, ప్రజానాయకులవలనను, ఆయా ప్రదేశముల స్థితిగతులఁ దెలిసికొనుట యందును, అభిలాషను జూపుచుండిరి. ప్రజలతోఁ

గలిసి మెలంగుచుఁ బ్రజానాయకుల గౌరవించుచున్నఁ దన్ను ప్రజలు గౌరవించి ప్రేమించుదురని వారు బాగుగ గుర్తెఱిఁగిరి. వారు హిందూదేశమునకు విచ్చేసినపైన 1910వ సంవత్సరము డిసంబరు నెలలో అలహాబాదులో హైందవ శ్రేయోభిలాషియు ఆంగ్లేయపుంగవుఁడును నగు సర్ విలియం వెడర్ బరన్‌గారి యాజమాన్యమున హిందూదేశీయ మహాజనసభ జయప్రదముగ జరిగెను. ఆసభవారు వారి తీర్మానములను రాజప్రతినిధిగారికి స్వయముగా విన్నవించుటకై ప్రతినిధులుగా ... నాయక ప్రముఖులఁ గొందఱనేర్పఱచిరి. అప్పటికీమహాసభ జననమంది 25 వత్సరములైనను నేరాజప్రతినిధిగారును స్వయముగాఁ దత్సభ ప్రతినిధులకు దర్శనమిచ్చి విన్నపము నందుటకుఁగాని, యామహాజనసభ హిందూదేశీయుల యభిప్రాయముల వెల్లడించుచున్నదని యంగీకరించుటకుఁ గాని సమ్మతించి యుండలేదు. అట్టి సందర్భములలో హార్డింజి ప్రభువుగారేమి యభిప్రాయమిచ్చెదరో యని ప్రజానాయకుల మనమున సందేహము కొంచెముండినను, ధీరస్వభావముగల యాప్రజాప్రతినిధులు రాజప్రతినిధిగారి దర్శనము నపేక్షించిరి. హార్డింజి ప్రభువుగారు వారి యభిప్రాయముల నాదరభావముతోఁ గైకొనఁదలంచి సర్ విలియం వెడర్‌బరన్‌గారిని, ప్రతినిధులను 1911వ సం॥ జనవరి నెల తే 3 దిన కలకత్తా నగరమునకు రండనియు వారి యభినందన పత్రికను స్వయముగాఁ గైకొనుటకు సమ్మ

తించితిననియు యాజ్ఞాపించిరి. నియమిత దివసమునకు సభ్యులు విచ్చేయఁగా వారి విన్నపముల నాలకించి తగిన ప్రత్యుత్తర మొసంగి పంపిరి. ఈవిధముగ హిందూదేశీయ మహాజనసభ వారి విషయమై హార్డింజి ప్రభువుగారు చూపిన గౌరవము నకై హిందూదేశీయులు మిక్కిలి సంతసించిరి. ప్రజలయొక్క యభిమానమునకుఁ బాత్రుఁడగుట కిదియే హార్డింజిగారి మొదటి కార్యము.

సామ్రాజ్య సభాధిపత్యము

నాఁటిదినముననే వారు సామ్రాజ్య శాసననిర్మాణ సభ యందు బ్రప్రథమమున నగ్రాసనాధిపత్యమునువహించి, తమకు ముందుండిన మింటో ప్రభువుగారి పరిపాలనలో జరిగిన మార్పుల యందుఁ దమ యభిమానమును గనఁబఱచుచు కార్యనిర్వహణ మున సభ్యుల సహాయము నభిలషించుచు సంక్షేపముగా నుపన్యసించిరి.

జర్మని రాకొమరుని కాతిథ్యము

ఈసంవత్సరారంభముననే జర్మనీదేశపు చక్రవర్తిగారి జ్యేష్ఠకుమారుఁడు విలాసార్థమై హిందూదేశమును దర్శించుటకై రాఁగా హార్డింజిగారు రాజకుమారుని సంచారమునకుఁ దగిన యనుకూలములను గల్గించిరి. ఆరాకొమారుఁడు ఫిబ్రవరి నెలలో కలకత్తా నగరమునకు వచ్చి రాజప్రతినిధిగారి యాతిథ్యమును బొందెను. కలకత్తా విశ్వవిద్యాలయమువారి పక్షమున హార్డింజి

ప్రభువుగారు జర్మనీ రాకొమరుని (డాక్టరు అఫ్‌లాస్) ధర్మ శాస్త్ర పండితులను గౌరవబిరుదముతో సత్కరించిరి. జర్మనీ రాకొమరుఁడు హిందూదేశీయులు తనకుఁజూపిన స్వాగత సత్కారములకు సంతోషించి, తాను విక్టోరియామహారాణి గారి మునిమనుమఁడనని యీదేశీయుఁలుచూపిన ప్రేమాతిశయ ములకు వారెంతయు వందనీయులని వచించిరి. తమ వసతి నను సరించి రాజప్రతినిధిగారు చేసిన యేర్పాటులకు వందనము లాచరించి యా రాకొమరుఁడు ఫిబ్రవరినెల 23-వ తేదిన బొంబాయి తీరమున నోడనెక్కి స్వదేశోన్ముఖుఁడై చనియెను.

## విద్యార్థులపై ప్రేమ

హార్డింజిప్రభువు తనపరిపాలనా ప్రారంభము నుండియు విద్యార్థులపైఁ గడు ప్రేమగలవారై వారు చదువుకొను గృహ ములను, భుజించుశాలలను, ఆడు విహార ప్రదేశములను, స్వయ ముగాఁ బరీక్షించుచుండిరి. మఱియు, కుగ్రామములనుండివచ్చి గొప్పగొప్ప నగరములలోఁ జదువుకొను బాలురపై నధికార మును వహించి మంచి చెడుగులను దెలిపి వారు సన్మార్గమును వదలకుండునటులు కనిపెట్టియుండు పోషణకర్తలు లేకపోవుట వలన, దుర్మార్గులతోఁజేరి చెడుదురనియుఁ గ్రమముగా నరాజక కృత్యములలోఁ బ్రవేశించి విద్యను దేహసౌఖ్యమును నాశనము చేసికొందురనియుఁ దలంచి, వారిస్థితి నెట్లు బాగుచేయుదుమా యని వారు యోచించుచుండిరి. ఒకనాఁడు రక్షక పరివార

మును విడచి, ఒంటరిగా వారు, (ఆక్సుఫర్డు మిషన్ హాస్టల్ సూపరింటెండెంట్) విద్యార్థి భోజనశాలా పర్యవీక్షకు లగు రెవరెండ్ హామ్ను దొరవారు వెంటరాఁగ, కలకత్తా యుత్తర భాగములో నున్న కొందఱ విద్యార్థుల విడుదులకు వెళ్లిరి. రాజ ప్రతినిధిగారి నా విద్యార్థు లెన్నడును జూచియుండనందు నను, నాఁడు రాజప్రతినిధిగారు తమ వసతులకువచ్చెదరని గమ నించుట కవకాశము లేకపోయినందునను, బాలురు తమ విడు దులకు వచ్చిన దొరగలిరుపు రెవ్వరోయని వారిరాకను గురించి గమనింపకయే యెవరిపని వారు చూచు కొనుచుండిరి. హార్డింజిగారు బాలుర గదులలోనికి వెళ్లి వారి వెంబడి కూర్చొని వారిపుస్తకములను, చిత్తు పొత్తములన్నుజూచి, తాను విద్యా ర్థిగానున్నపుడు జరుగుచుండిన పరీక్షల పద్ధతియు, తత్కాలపు పద్ధతియు, బాలురతోఁ జర్చించి, మృదుమధురోక్తులఁగొడ బాలురకుఁ దమపై నిండారు ప్రేమజనించునట్లు మెలఁగిరి. ఈవిధముగ ననేకులబాలురఁ గలసి సంభాషించి తమస్త్రోనవఁ బోయిరి. అనంతరము బాలురకుఁ దమగదుల దర్శించినవారు రాజప్రతినిధిగారని తెలియఁగాఁ గొందఱు నమ్మక పోయిరి. కాని యదితుదకు నిజమేయని వారికి తెలిసి యందఱు నాశ్చర్య పడిరి. ఈవృత్తాంతము నగరమందుఁ దెలియఁగా, పాఠశాలాధి కారులు విద్యార్థి వసతులను జక్కనిస్థితిలోనుంచి, రాజప్రతినిధి గారు హఠాత్తుగ నెపుడుదర్శింతురోయని భయాకులిత చిత్తులై మునుపటికంటె నెక్కుడుశ్రద్ధతో బాలుర విచారించుచుండిరి.

నొక వైద్యాలయ నిర్మాణముఁదలపెట్టి దానికి శంకుస్థాపనము గావింప హార్డింజి ప్రభువు గారిని బ్రార్థింప నందుల కంగీకరించి యట్లు సల్పిరి.

## చక్రవర్తిగారి పట్టాభిషేకము

డిసంబరుమాసము సమీపించుకొలఁదిని పట్టాభిషేక కార్యముల సిద్ధపఱచుచు, హార్డింజిగారు లేశమైన విరామము లేకుండిరి. ఆనెల తే 2 ది శ్రీరాజదంపతులు హిందూదేశము వచ్చెదరని పైన వివరింపఁబడినదికదా! అదిసమయమునకుఁ జాల ముందుగనే సర్వము సంసిద్ధమైయుండెను. హార్డింజిగారు శ్రీరాజదంపతులకు స్వాగత మొసంగ బొంబాయికిఁ బోయిరి. నియమితకాలమునకు శ్రీరాజదంపతులు విచ్చేయ, హార్డింజిప్రభువు శ్రీవారిని సకల రాజ సన్మానములతో నెదుర్కొని, రెండు దినము లచట శ్రీవార్లతోనుండి, ఢిల్లీనగరమునకుఁ జనిరి. శ్రీరాజదంపతులును సావకాశముగఁ గొన్నిదినములకు ఢిల్లీ చేరిరి. సతీయుతులగు శ్రీచక్రవర్తిగారి పట్టాభిషేక మహోత్సవ మతివైభవముగ జరిగెను. ఆశుభసమయమున మనసార్వభౌము డేవరముల బ్రసాదించునో యని హిందూదేశీయు లుత్కంఠులై యుండిరి. ఆ వరములన్నిటిని హార్డింజిగారు ప్రకటించిరి. అందు:—(1) హిందూదేశప్రారంభవిద్యాభివృద్ధికై 50 లక్షల రూపాయలు ప్రతిసంవత్సరము ప్రస్తుతముకంటె నధికముగ వ్యయము చేయఁబడుననియు, (2) ఇఁకమీఁద కలకత్తా నగర

మునకు మాఱుగ ఢిల్లీనగరము హిందూదేశముఖ్యపట్టణమై యుండుననియు, (3) బంగాళారాజధానికొక గవర్నరును, బీహారు ఛోటానాగపురము, ఒరిస్సారాష్ట్రములకొక లెఫ్టినెంటుగవర్నరు, అస్సామునకు ఛీఫ్ కమీషనరును, నియమింపఁబడుదు రనియు ననునవి ముఖ్యమైనవి. ఈ గొప్పమార్పులు చాల వఱకు శ్రీహార్డింజిగారి యుపదేశముననే జరిగినటులు ప్రభుత్వాధికార ప్రచురణముల వలనఁ దెలియుచున్నది.

హార్డింజిగారి లేఖ

పట్టాభిషేకోత్సవ సంబంధముగాజరుగు రాజకీయ వర్తనములలో నొండగు 'రాజధానిని మార్చుట.ు' గూ మనమంత్రిగారికి వీరు వ్రాసిన విషయముల సారాంశము నిం దాహరించెదము:— "ప్రస్తుతసందర్భాను సారముగా సర్వ లగు దేశీయులకు నిప్పటికంటె నెక్కుడు పరిపాలనాసంబంధ మొసఁగుట ప్రాముఖ్యము. అయ్యది స్థానిక పాలనావిషయమై యుండుట నామతము. వీరిసంబంధము గలిగినస్థానికాధికారము లందు, దుష్పరిపాలనా నిరోధమునకుఁగాక, మఱియే రాజకీయ కార్యక్రమ నిర్వహణమునందును సర్వపాలకాధ్యక్ష స్థానముౘ వారు ప్రవేశము గలిగించుకొనరాదనియుఁ దలఁతు. నాయీ యభిప్రాయము సాధువైనచో స్థానికాధికార స్థానముగల కల కత్తానుండి సర్వాధ్యక్షస్థానము స్థలాంతరమునకు మార్చుట సమంజసము. అట్లయిన భారతీయ ప్రాచీన ప్రాశస్త్యము గల

ఢిల్లీనగరమున కంటె రాజధానికి సముచితస్థలము వేఱొండు కానరాదు. హైందవులును మహమ్మదీయులునైన భారతీయ రాజులు మూర్ధాభిషిక్తులైన యీ నగరరాజముననే మన ప్రభువుగారును దొల్లిటి వారిననుకరించి భారతీయులభక్తి విశ్వాసములఁ బడయుట బాగనితలంతు. "ఢిల్లీశ్వరోవా! జగదీశ్వరోవా" యనుజనశ్రుతి భారతీయులం దిప్పటికి నాదరణీయంబై యున్నది."

అంతటఁ గలకత్తా వర్తకులను నాంగ్లవర్తక సంఘము వారును వంగదేశీయులును, దమపట్టణప్రాముఖ్యము ద్రుంగుడు వడునని యాందోళనాయత్తులైరి.

మఱియు వీరి (హార్డింజి) యుపదేశపూర్వకమై ఘటిల్లిన వంగదేశీయ సంయోగమునకై కర్జన్ప్రభువు మున్నగు పార్లమెంటులోని కొందఱు సభ్యులును, కొందఱాంగ్లేయ పత్రికాధిపతులును, వారిని దూషించిరి. కాని హార్డింజిప్రభువు ధైర్యముతోఁ బ్రజాభివృద్ధికరము లగుమార్గముల నాచరణలోఁ బెట్టి ప్రజల కృతజ్ఞతకుఁ బాత్రుఁడయ్యెను. ఆసంవత్సరము డిసంబరు నెలలో కలకత్తానగరమున పండిత విషణ నారాయణ దారుగారి యాధిపత్యముక్రింద జరిగిన హిందూదేశీయ మహాసభయందు బంగాళావిభజనను రద్దుపఱచినందునకై గవర్నమెంటువారికి వందనంబు లాచరించుచు, ఆఱుసంవత్సరముల నుండి యీమహాజనసభవా రేకగ్రీవముగ రద్దుపఱుపుఁ డని

కోరిన యక్రమవిభజనము నేఁడు హార్డింజి, క్రూప్రభువుల మూలమున రద్దుపఱుపఁబడినదనియు, ఆవిభజనపురద్దును శ్రీచక్ర వర్తిగారు స్వయముగావచ్చి దర్బారు సమయమునఁ బ్రకటించు టంతయు శ్రీవారి దయార్ద్రహృదయమును మరింతఁ బ్రకా శింపఁజేయుచున్నదనియు, హార్డింజిప్రభువు ప్రజలలోఁ గలవర మున కాదికారణమును గ్రహించి దానిని నాశమొందించుట వలన వారి కుశాగ్రబుద్ధియు రాజకార్యధురంధరత్వమును మరింత వెల్లడియైన వనియు, ఈ విధముగనే వారు హిందూ దేశ రాజప్రతినిధిత్వమును గొనవఱకు జరపిన నెంతో జయ ప్రదమగు పరిపాలనమై బెంటింగు, క్యానింగు, రిప్పన్ ప్రభువుల పరిపాలనలతో సమానమైన దగుననియు దేశభక్తులు బాబు సురేంద్రనాథ బానర్జిగారు నొక్కి వక్కాణించిరి. ఈవిధముగ ననేక హిందూదేశీయ ప్రముఖులును, హిందూదేశ వార్తా పత్రికాధిపతులును, బంగాళాదేశమునకు శాంతిని గలుగఁజేసి నందులకై హార్డింజి ప్రభువును గొనియాడిరి.

## రాజదంపతుల మాతృదేశ ప్రయాణము

శ్రీరాజదంపతులు హిందూదేశమున నుండు వఱకు వారికిఁ దగిన సన్మానములన్నియు జరిపి జనవరి తే 10 దిన శ్రీవార్లను వీడ్కొలుప వైస్రాయిగారు బొంబాయినగరము నకుఁజనిరి. 'మెడీనా' పొగయోడలో శ్రీవార్ల నెక్కించి వారి సెలవుఁ గైకొని హార్డింజి ప్రభువు బొంబాయికి మఱల విచ్చేసి రెండుదినము లచ్చటనుండి యనంతరము స్వస్థానమున కేగెను.

## చక్రవర్తిగారు హార్డింజిగారిని సన్మానించుట

చక్రవర్తి పట్టాభిషేక మహోత్సవమునకై హార్డింజి ప్రభువుగారు చేసిన యేర్పాటులకు శ్రీజార్జి చక్రవర్తిగారును శ్రీమేరీచక్రవర్తినిగారును మిక్కిలి మెచ్చుకొని హార్డింజి ప్రభువుగారిని సన్మానింపఁదలంచి 'చెయిన్ ఆఫ్ ది విక్టోరియన్ ఆర్డర్' అను ఘనతమమైన బిరుదమునొసంగిరి. హార్డింజిప్రభువుగారి కప్పటికే రాజుగారు వారియ్యఁదగుబిరుదుల ననేకముల నొసంగి యుండిరి. కాన నూతనబిరుదము నేది యిచ్చెదమాయని యాలోచించి యీ యపూర్వబిరుదము నొసంగిరి. ఆ బిరుదు రాజకుటుంబమువారికిని, రాజబంధువులకును, అన్యదేశాధిపతులకును, సకృత్తుగా నియ్యఁబడునది; వారికిఁదప్ప నన్యులకు సాధారణముగానియ్యరు. ఇతరులలో నల్గురుమాత్రమే యీ బిరుదును ధరించుచున్నారు. వారెవరనః-ఆర్గైల్ డ్యూక్, పైఫ్ డ్యూక్, లాండ్సుడౌన్ ప్రభువు, కర్జన్ ప్రభువు, కెంటర్ బరీ ఆర్చిబిషప్, మన హార్డింజిప్రభువు. అట్టి గొప్ప గౌరవమును మన రాజప్రతినిధిగారి కిచ్చినందునకై హిందూదేశీయులెల్లరు సంతోషించి హార్డింజిగారి నభినందించిరి.

## డక్కా విశ్వవిద్యాలయము

ఈసంవత్సరారంభమున హార్డింజి ప్రభువు డక్కాపట్టణమున నొకనూతన విశ్వవిద్యాలయమును స్థాపింప యత్నించి తూర్పు బంగాళాదేశమును దర్శించి యచ్చట ప్రముఖులతో

సంభాషించెను. బంగాళారాజధానిలోఁ గొందఱు బెంగాలీలు డక్కాయందు యూనివర్సిటీ స్థాపించిన కలకత్తా యూనివర్సిటియొక్క ప్రాముఖ్యము తగ్గునేమో యని భయపడి నూతన స్థాపన మనావశ్యకమని పోరాడిరి. కాని యీవంగదేశీయుల సందేహములను హార్డింజిగారు మృదువాక్యములవలనఁ బాపి, శాస్త్రపద్ధతుల ననుసరించి విశ్వవిద్యాలయము స్థాపించెద మని చెప్పిరి.

## పర్యటనములు

సాధారణముగఁ బ్రతిప్రతినిధియుఁ దనపరిపాలనా నియమితకాలమగు నయిదువత్సరములలోఁగా హిందూదేశమున నలుపార్శ్వములంగల ముఖ్యపట్టణములు దర్శించుట యాచారము. ఈపర్యటనములు ప్రతిసంవత్సరము వేసవికాలమునను, శీతకాలమునను కొన్ని యనుకూలములైన మాసములలో జరుగుచుండును. ఈపర్యటనమువలని ముఖ్యోపయోగము ప్రజల దేశాచారములను స్థితిగతులను స్వయముగాఁ బ్రభువుగారు గుర్తెఱుంగుటయే. మఱియు స్వదేశ సంస్థానాధిపతులందర్శించి వారిరాష్ట్ర పరిపాలనము లెట్లు జరుగుచున్నదియు గమనించి వారితో సఖ్యము సేసికొనుచుండుటయు, రాజప్రతినిధుల యాచారము. తదనుసారముగా హార్డింజిప్రభువుగారు 1912 వ సంవత్సరము మార్చి యేప్రిల్ నెలలలో పాటియాల, లక్నో, లాహోరు మీరటు, మున్నగు స్థలములను, అక్టోబరు నవంబరు డిసంబరు

నెలలలో కాశ్మీరము, రాజపుత్రస్థానము మధ్యహిందూదేశము మధ్యపరగణాలలోని కొన్ని ముఖ్యస్థానములం దర్శించి ఢిల్లీ నగరముం జేరిరి.

## రాజప్రతినిధిగారి కగ్నిగోళాపాయము

డిశంబరు నెల తే 23 దిన ఢిల్లీనగరమునఁ బ్రథమప్రవేశ మహోత్సవములను జరుప[illegible]యునని హార్డింజి ప్రభువుగారు స[illegible]. ఆమహోత్సవమునకు వలయు గజాశ్వాది సమస్త సా[illegible]నములను సమకూర్పఁబడెను. శాసననిర్మాణసభ్యులును, పరగణాల పాలకులును, స్వదేశాధినాథులును, గొప్ప గొప్పవిద్యాగేయులును, ప్రజానాయకులును, ఢిల్లీనగరమున సమావేశమైరి. హార్డింజి ప్రభుప్రగారును ప్రభ్విగారును పట్టపేనుఁగునెక్కి రాజచిహ్నములతో నూరేగుచు ఢిల్లీ పుర ప్రవేశములఁ బ్రథమమునఁ దన్నగరపాలక సంఘాధ్యక్షుని స్వాగత పత్త్రికను గైకొనిరి.

అందులకుఁ బ్రత్యుత్తరమిచ్చుచు హిందూమహాయుగమునను, మహమ్మదీయమహాయుగమునను, ఢిల్లీనగరముయొక్క వైభవమును శ్రీవారు పేర్కొనిరి. అనంతర ముత్సవమారంభించి 'ఛాడ్నిచౌక్' అను ప్రదేశమువఱకువచ్చిరి. అక్కడ హఠాత్తుగా నొక ప్రేలుడుగుండు (బాంబు) రాజప్రతినిధిగారి యంబారిపైఁ బడెను. ఈఘోరవిపత్తునుగూర్చి హార్డింజిప్రభ్వి గారు వ్రాసిన విషాదకరమగు లేఖ నిందుఁ బేర్కొనెదము.

'జయజయధ్వనులతో నిండియున్న 'ఛాంద్నిచౌక్' మీఁదుగా మేము పోవుచుండ, నే నాకస్మికముగాఁ ద్రుళ్లిపడి ముందుకొఱగి తిరిగి నాస్థలమును సర్దుకొనునంతలో నాకు దిగ్భ్రమచేఁ జెప్పరానంత చెవుడు కలిగి తలలో నొకవిధమైన ఝూంకారము పుట్టినది. రాజప్రతినిధిగారు నా వైపుచూచి 'సఖీ! యది బాంబు ప్రేలుడు' అనిరి. మా యేనుఁగు ఆగిపోయెను. శ్రీవారు మావటివానిఁ బిలిచి యేనుఁగును నడిపింపుమనిరి. [illegible] ప్రజలు నిశ్శబ్దముగా నున్నారనియును కొంచెముగాని వెంటనే ధ్వనులు వినఁబడెను. మా అంబారి వెనుకభాగము భగ్నమయ్యెను. శ్రీ ప్రాయిగారిముఖము పాలిపోవుచుండెను. 'మీకు గాయము తగిలెనా' యని నేను వారి నడిగితిని. 'నాకుఁ దెలియదుగాని నే నదరిపడితిని. అయినను సాగిపోవము' అని వారు చెప్పిరి. ఒక్కనిమిషమునుండి నేను వెనుకకుఁ దిరిగి చూడఁగా శ్రీవారి యాపలిభుజమునుమీఁద దుస్తులు చినిగి లోపల నెఱ్ఱనికండ కనఁబడెను. అంత 'వారికి నేనిసంగతిని జెప్పినయెడల భయము కలిగించినదాన [illegible] చెప్పక యూఱకొనిన నేనుఁగు [illegible] వారికి హానికలుగును' అని సందేహించుచు నే నొకసారి వెనుకకుఁ దిరిగి చూచువఱకుఁ జచ్చి[illegible] చూచితిని. 'మన వెనుకనున్నవాఁడు చచ్చినాఁడని [illegible]నుచున్నాను. ఉత్సవమాపి వేయుదమా' యని నేను శ్రీవారి నడిగితిని. ఇప్పటికి మేము

నూటయేఁబదిగజములు సాగితిమి. ఇట్టి స్థితిగతులలో మనము
పోజాలమని వారు సెలవిచ్చిరి. అప్పుడు నేను మా గజము
నాపించి మాయెదుట నంభారిపైనున్న కర్నల్ మేక్సువెల్
గారికి సంజ్ఞచేసితిని. అప్పుడాయన పరుగెత్తిరాఁగా 'వెనుకఁబడి
యున్న మనుష్యునికొఱకు మీరేమైనను జేయఁగలరా?' యని
శ్రీవారు వారినడిగిరి. 'కర్నలు రాబర్ట్సుగారు వచ్చిన మంచిది.
శ్రీవారిభుజమునకు దెబ్బతగిలి యున్న' దని నేనందిచ్చి [illegible]
[illegible] ప్రభువుగారికిఁ గొంచెము స్పృహతప్పుచుండెను.
వారికపుడపుడు స్పృహ కలుగఁగా నుత్సవము నడపించుటకు
కీయవలసిన యాజ్ఞలన్నియు నిచ్చిరి. తరువాతఁ జెప్పవలసిన
దేమున్నది? శ్రీవారిని అంభారినుంచి దింపుటలోఁగల
కష్టములు, వారిని మోటారుబండిలో నెక్కించుట, ఇంటికిఁ
దీసికొనిపోవుట, దుస్తులు మార్పించుట, మొదలైనవన్నియు
జరిగెను. ఆఱు గాయములనుండి రక్తము కారుచుండెను. ఇం
టిలో నెవ్వరును లేరు. కాని, పరివారమే సాహాయ్యముచేసెను."
ఆహా! కాంతుఁడీ దురవస్థలో నుండఁగా నా సాధ్వీమణి మనః
క్లేశముల నేమని వచింపఁగలము? ఇంగ్లాండుదేశమున బంధు
లు, మిత్రుల విడనాడి భర్తగారికిఁ జేదోడువాఁదోడైయుండ
[illegible]తఖండమునకు విచ్చేసిన యాసాధ్వి యంతరంగమున
తనకు రక్షకుఁడని నమ్మి స్త్రీయైనను ధైర్యము విడ
[illegible]రగారికి ధైర్యమును గలిగింపక, సుంక్షితముగ వారి

ఇంటికి వచ్చి చికిత్సఁ జేయుంచెను. హార్డింజిప్రభువు హిందూదేశ మునకు వచ్చినదిమొదలు ప్రజలకెంతో మేలుసేయువాఁడై న్యాయైకశీలుఁడని కీర్తివహించెను. అట్టిప్రజాభిమాని కపాయము గలుగఁజేయఁదలంచిన నరాధముఁడెవఁడో, యేదేశీయుఁడోగాని, యపకీర్తియును గళంకమును భరతఖండమునకంతయు వాటిల్లెననుట స్పష్టము. ఈవిషాదకరమగు వార్త భారతీయులకుఁ దెలియఁగనే యందఱు నిర్విణ్ణులైరి. ప్రతివానికిని దుఃఖమును రోషావేశమును ఉద్రేకమును [illegible] మాతృభూమికిఁ గళంకము గలుగఁజేసిన ఘాతుకుఁడెవఁడో వెదకి వానిని వానిసహచరులతోడ నంతమొందింపుఁడనికోరుచు గొందఱు స్వదేశ సంస్థానాధిపతులు వేలకొలఁది ద్రవ్యము నాయాతతాయివార్తఁ దెలిపినవానికి బహుమానముగానిచ్చెద మనిరి. అనేక గ్రామములలోఁ బ్రజలు సభలుచేసి హార్డింజి ప్రభువు గారి కపాయము తప్పించినందులకై భగవంతునికి నమస్కారములుచేయుచు హార్డింజిప్రభువుగారికి శీఘ్రముగా గాయము మానుటకుఁ దమ యాశీర్వచనములనంపిరి. దైవకృపవలన వారికిఁ గ్రమముగా గాయములు మానెను. ఆయాపదలో దండనుండిన మావటీవానిని బిలిపించి వానిధైర్యమునకుమెచ్చి సయముగా వానికిఁ బారితోషిక మొసంగిరి. మఱియుఁజనిపో మావటీవాని కుటుంబమునకుఁ దన సానుభూతిని దెలిపి ముగనకుఁ దగునేర్పాటులఁజేసిరి.

## అపాయానంతర ప్రథమ బహిరంగదర్శనము

ఈవిధముగ గొప్పగండమును గడచి హార్డింజిప్రభువు 1913 వ సంవత్సరము జనవరినెల తే 27 దిని సామ్రాజ్యశాసన నిర్మాణ సభకు విచ్చేసిరి. వారి చేతికిఁదగిలిన గాయము లింకను సంపూర్ణముగమానలేదు. కాని, యాగండముగడచిన వెంటనే సిం హాసనంబున సభాస్తారులతోడి సల్లాపముల కుల్లాసపడునం [illegible] కాన దేహమింకను స్వాస్థ్యముగాంచకున్నను సామ్రాజ్య సభ నలంకరించి ఘాతిగుం[illegible]వారిగు నాతతాయుల కేని హృదయములు నీరైపోవునటు లుపన్యసించిరి. "ప్రజానురంజకుఁడను గాక రాజకీవుంవిడనాడి, రక్షకభటులనైన వెంటఁగొనక నాసంరక్షణ మారక్షకభటులకంటెను, దుదకు నాభార్యకంటెను, భూతదయ, రాజభక్తి, నైసర్గికమైన హిందూజనమెక్కుడను పాటించుననియుంటి" నని శ్రీవారు నుడువ సభాస్తారులకెల్లరకుఁ దలవంపులై యుండెను. అయినను, హిందూదేశీయులు రాజభక్తి నుగ్గుపాలతోఁ ద్రాగినవారనియు రాజభక్తి విరహితులగు క్రూరులసంఖ్య యత్యల్పమనియు హార్డింజిప్రభువుగారికిఁ దెలియును. కాన హిందూదేశముపైఁ దనకుఁగల ప్రేమయు, పరిపాలనావిషయమున తానవలంబించు రాజనీతియు, ఈదుష్కార్యమువలన నేమాత్రముమారవనియు, ఆవిషయమై జనులు భయపడ వలదనియు, ప్రకటించి వారి యుదారగుణసంపన్నత్వమును మఱింత ప్రజ్వలింపఁజేసి దేశీయుల కృతజ్ఞతకుఁ బాత్రులైరి.

## ఢిల్లీలో జ్ఞాపకచిహ్నము

ఢిల్లీ నగరవాసులు, హార్డింజిగా రాపదనుండి తప్పించుకొనినందులకుఁ దమ సంతోషమును, దుష్కార్యనిరసనమును, దమ ప్రభుభక్తిని, శాశ్వతముగా సూచించుటకై హార్డింజిగారి పేర నొకజ్ఞాపక చిహ్నము నేర్పఱచఁ దలంచి వారి ప్రతిమ నొకటి నిర్మించవలెనని యభిప్రాయపడిరి. ఈవిషయము హార్డింజిగారికిఁ దెలియఁగాఁ దనకు ప్రతిమను నిర్మించుట[illegible] కార్యములు తానెవియు జేయలేదనియు ప్రజలకుపయోగించు కార్యముల నాద్రవ్యమును వినియోగించుటయే తనకిష్టమనియుఁ దెలియఁజేసిరి. అంతట కమిటీవారు ప్రతిమకై తాము చేసిన యేర్పాటులను మార్చుకొని 'ఛాందినీచౌకు' నొద్ద నొక గొప్పభవనమును నిర్మించి హార్డింజిగారి పేర దానిని బుస్తక భాండాగారముగా నుపయోగించిరి.

## జన్మదివసోత్సవము

హార్డింజిప్రభ్విగారు తనభర్తగారు సురక్షితులై వందునకుఁ దనసంతోషమును దెలుపుచు వారి జన్మదినసమగు జూన్ నెల తే 20 దిన తమ భవనమున గొప్ప వేడుక చేయుటయేకాక హిందూదేశమందంతను బాలికాబాలకులకు ఫలాహారములిచ్చి వారిని సంతోషపఱచవలెనని తలంచిరి. ఈయమగారి యభిప్రాయప్రకార మొనర్చుచు దేశీయులాదినమున సమావేశమై, వేడుకలతో శ్రీవారి వర్ధంతి గడపిరి.

# కాన్పూరుమసీదు వ్యవహారము

1913 సంవత్సరము, ఆగస్టునెలలో హిందూదేశమున, నందులో ముఖ్యముగ నుత్తర హిందూస్థానమున, నివసించు మహమ్మదీయులలో నొకకల్లోలము జరిగెను. కాన్పూరు అను పట్టణమునఁ బారిశుద్ధ్య సంఘము వారు పట్టణవీధులను విశాలముగఁ జేయుటలో మచిలీ బజారు మసీదులోని ముందరిభాగమును బడఁగొట్టించిరి. తామెంతో పవిత్రముగా నెంచుకొని యనుదినము దైవప్రార్థనకై సమావేశమగు నా మసీదులోఁ గొంతభాగమును దొరతనమువారు పడఁగొట్టించఁగా నచ్చట మహమ్మదీయులు రోషావేశ పరవశులై గుంపులు గుంపులుగా వచ్చి, మసీదులోఁ బడఁగొట్టఁబడిన భాగమును మరల కట్టుటకుఁ బ్రారంభించిరి. అంతట రక్షక భటు (పోలీస్) లాయుధపాణులై వచ్చి వారి యుద్యమము నాపుటకై యత్నించిరి. కాని సఫలులు గాక పోయిరి. మహమ్మదీయులు గుంపులుగా బడితెలతో పోలీసువారి పైబడను, అల్లు అువ్వను, బ్రారంభించిరి. అంతట నారక్షకభటులు తుపాకులఁగాల్చిరి. మహమ్మదీయులలోఁ గొందఱు మరణించిరి. దానిఁజూచి యెక్కడవారక్కడఁ బాఱిపోయిరి. ఆరక్షక శాఖవారు 106 గురు మహమ్మదీయులఁబట్టి చెరసాలం బెట్టిరి. హిందూదేశీయులో మహమ్మదీయు లనేకులు దొరతనమువారు మసీదులఁబడఁ గొట్టించుట మిక్కిలి పొరబాటనిరి. న్యాయవాది వృత్తిం గుశ

లుతో కొందఱు మహమ్మదీయులు ముద్దయిలకు మద్దతుగా సామ్ముగొనకయే న్యాయస్థానముల వాదింతు మనిరి. ఆ దోషులు న్యాయస్థానముల విచారింపఁబడుచుండ నుదారహృద యులగు హార్డింజి ప్రభువుగారు దైనందినచర్య నారయుచుం డిరి. వంగదేశీయుల నాదేశవిభాగముంబోలి యాత్రేయుతో ముసల్మానుల నీ మసీదు విషయ మాందోళికరించెను. అట్టి స్థితిలో శ్రీహార్డింజిగారు (అక్టోబరు నెల 14 తేదిన) కాన్పూరు పట్టణమునకు వెళ్ళి వివాదస్థలములను బరీక్షించి ప్రముఖులగు మహమ్మదీయులతో సంభాషించి వారిస్వాగత పూర్వకంబు లగు విన్నపంబుల నన్నించిరి. మహమ్మదీయ ప్రముఖులం దఱు ప్రభుచంద్రుని ప్రత్యుత్తరమునకై మిక్కిలి యుత్సాహ ముతో వేచియుండిరి. అపుడు హార్డింజిప్రభువు "నేను మీకుఁ దండ్రిని; మీరు నాయనుంగుబిడ్డలు. బిడ్డలు తప్పుచేసినపుడు వారిని సన్మార్గమున వర్తింపఁ జేయుటకై తండ్రి దయార్ద్ర హృదయముతోడనే శిక్షింపవలసి యుండును" అను హిత వాక్యములంబల్కి పదివారములనుండి చెఱసాలలోనుండు 106 గురు ముద్దయిలను విడుదలఁ జేయుచున్నాననియు, మసీదు మొగదల కాలిత్రోవ యుండఱవాడుకకై విడచి యుపరిభాగ మున గోపురముఁ గట్టుకొనుఁడనియు నాజ్ఞాపించి మహమ్మ దీయులను శాంతపఱచిరి. రాజనీతి నైపుణ్యపూర్ణమగు నా నిర్ణయమునకు హిందువులందఱు శ్రీవారి నభినందించిరి.

## దక్షిణాఫ్రికా భారతీయులకష్టములు

ఆవెంటనే దక్షిణాఫ్రికాధనివిష్టులగు భారతీయులకష్ట ములు శ్రీవారి దృష్టి నాకర్షించెను. ఆంగ్లేయ పరిపాలకుల ప్రకటనల ననుసరించి వారి సామ్రాజ్యములలో నెల్లఁ బ్రతి భారతీయునకును పౌరత్వస్వామ్యాధికారము కలిగియున్నను, హిందూదేశ దురదృష్టవశమున నట్టిస్వామ్యములను స్వపరిపాల నాధికారము గల దక్షిణాఫ్రికా దేశపరిపాలకులు భారతీయుల కొసంగక వారిని పశుప్రాయులుగ నెంచి హింసించఁ దొడం గిరి. మొట్ట మొదట దక్షిణాఫ్రికా దేశములోని ప్రతి హైందవుఁడును పంజికాధికృతు కడకు (రిజస్ట్రారు) వెళ్ళి రెండుచేతుల పది వ్రేళ్లయు గుర్తుల నద్దించుకొని, వారివారి పేళ్లను వ్రాయించ వలె ననిరి. గౌరవలోపమైన యీ నీచకార్యమునకు మనవారు సమ్మతించరైరి. ఆ విధముగ నెదురొడ్డిన వారిలో 2700 మంది హైందవులు బందీకృతులైరి. అచటి తోటల, గనులఁ బనులఁ జేయఁ గొన్ని నియమములతో నీదేశీయులను బ్రతినిధుల మూల మున నులాందలు మొదలగు నందలి పాశ్చాత్యులే మొదట రప్పించుకొనిరి. నియమితకాలము గడచిన తర్వాత స్వదేశము నకు మరలిరాక దక్షిణాఫ్రికాయందే వసించ నెంచిన 16 వత్స రముల వయస్సుమించిన ప్రతిపురుషుఁడును 13 యేండ్లప్రాయ ముగల ప్రతి స్త్రీయును, సంవత్సరమునకు రు 45 లు సుంకము చెల్లించవలెనని ఇంకొక దారుణ శాసన మేర్పఱచిరి. దక్షిణా

ఫ్రికాలోనుండు హైందవులు దక్షిణాఫ్రికాలోని నాలుగు రాజధానులలో నొకదానినుండి మరియొకదానికి స్వేచ్ఛగాం బోవుటకు హక్కు లేదనిరి. హైందవులు వారివారి కులాచారముల ప్రకారము దక్షిణాఫ్రికాలోగాని ఇతరదేశములలోగాని చేసికొను వివాహములు దక్షిణాఫ్రికా చట్టమునుబట్టి చెల్లవనియు, అట్టి భార్యలైనవారికి, వారిసంతతివారికి, స్వత్వస్వామ్యము గలుగదనియు శాసించిరి. భారతీయులు దక్షిణాఫ్రికాలో వ్యాపారము చేయుట కవకాశము లేకుండునట్లు ప్ర[illegible] చిరి. భారతీయులకు దక్షిణాఫ్రికాలో రాజకీయ సంబంధమైన స్వామ్యమున కనర్హులనియు, తత్ప్రభుత్వమువారు నియమించిన స్థలములోందప్ప వేఱు ప్రదేశములలో నాతని కేవిధమైన యాస్తిగూడ నుండరాదనియు ననిరి. ఆ దేశమున రైలులో నెక్కువ తరగతిబండ్లలో పయనము చేయుటకుంగాని, మునిసిపాలిటీవారి స్నానపు గొట్ల నుపయోగించుకొనుటకు గాని, పాఠశాలలో బాలుర చదివించుకొనుటకు గాని, హైందవుల కనేకాటంకము లేర్పఱచిరి. ఈవిధముగా దక్షిణాఫ్రికాలో హైందవులు సాధారణముగ మానవస్వామ్యముల సైతము గోల్పోయి, యనేకకఠినశాసనముల భరింపంజాలక, తత్ప్రభుత్వమువారి నిబంధనలకు లోబడినయెడల భరతఖండమున కపకీర్తి వాటిల్లుననియు, భారతీయ లింకను నీచముగ బాధింపబడుదురనియు, గమనించి వారాక్రూరశాసనముల నంగీకరింపక

"మేము దొంగలము కాము. జ్ఞానశిఖరాగ్రంబుననుండి ప్రపంచమందెల్లఁ బ్రఖ్యాతిఁ జెందిన యార్యసత్తముల సంతతివారము. మఱియు నాంగ్లేయ సామ్రాజ్యమునకు శిరోభూషణమై వన్నెదెచ్చిన భరతఖండ వాసులము. శ్రీవిక్టోరియా మహారాణిగారి యొక్కయు శ్రీసప్తమైడ్వర్డు చక్రవర్తియొక్కయు, శ్రీ ఐదవ జార్జి సార్వభౌమునియొక్కయుఁ బ్రకటింపఁ సందేశముల వాగ్దానముల వలన నాంగ్లేయ సామ్రాజ్యమునందెచ్చటికి వెళ్లను నా జ[illegible] హక్కీ[illegible]

నడకను నేనొక యాంగ్లేయునివలె మాటాడితిని.
నివటి తేర్పడి యెచ్చట ప్రజాపీడనము వ్యాపించియుండునో యచ్చటి ప్రజలకొఱకై పోరాడుట నా పవిత్రధర్మమని పసితనమున నుండియు నేను నేర్చుకొంటిని. క్రైస్తవ మతావలంబకుఁడను గావున నిటఁగొన్ని మాటలు చెప్పఁదలఁచితిని. పరమదయాళువైన యేసుక్రీస్తుయొక్క శిష్యులమనియు ననుచరులమనియుఁ జెప్పుకొనుచు గర్వపడుచుండు వారీ చందమున దక్షిణాఫ్రికాలోని భారతీయులను నతిక్రూరముగఁ జూచుచుఁ బగవారైనఁ బడరాని యిడుముల పాల్సేయు చుండుట చూడఁగా మదీయశోషనహిన్న వేయినాలుకలతో గోరాడుచున్నయది. క్రైస్తవమతమే యననేల? ప్రపంచమున దీనిని నసహ్యకరముగఁజూడని జాతి కలదా? లేదు. ఈ క్రైస్తవులందఱు తమ మతశాసనముల నుల్లంఘించుట లేదా? ఇఁక వీరికి క్రైస్[illegible] ప్రభు వెట్లగును? పరమేశ్వరుఁ డెట్లగును? వీరు మతద[illegible]

కూలివారిని నానావిధముల హింసించియు ననేక ఘోరకృత్య
ముల పాలుసేసిరి. విషాదకరములు నమానుషములు నగు నకృ
త్యములన్నియు భరతఖండవాసుల శ్రోత్రపుటములకు ములు
కులవలె నాకి యొక్కొక్కవాని హృదయాంతరాళమునుండి
దుఃఖమును, క్రోధమును పరంపరలుగాఁ బ్రజ్వరిల్ల సాగెను.
చెన్నరాజధాని క్రైస్తవమత పీఠాధ్యక్షులు సైతము తమ
[illegible]న్నాము. దుఃఖమును పట్టఁజాలక యిట్లు నుడివిరి. "ఇంత
[illegible] సమానమైన మానవ స్వాతంత్ర్యములఁ బొందఁ సం
పూర్ణాధికారము గలవారము. అట్టి మాకు మీరు మానుషే
తరములైన నిబంధనలకుఁ జట్టములకు లోఁబడవలెనను నాగ
రక సమ్మతము కాదు. కావున మేమంగీకరింపము. పన్నులు
చెల్లింపము." అని యేకగ్రీవముగా సమ్మెకట్టిరి. అనేకులు
చెఱసాలల పాలైరి. ఇదియే సాత్విక నిరోధోద్యమము. ఈ
యుద్యమమున కగ్రదూత భారత పుత్రావతంసంబగు శ్రీయుత
మోహనదాస్ కరంచంద్ గంధిగారు. వేలకొలఁది రూప్యముల
నెలకు సంపాదించుచు నున్నతన్యాయవాది వృత్తినున్న యా
నిరుపమాన దేశభక్తాగ్రేసరుఁడు సర్వస్వమును వదలి భార్యా
పుత్రాదులతోడ సామాన్య జనులలో నైక్యమై పడరానిపాట్లు
పడి సాత్వికనిరోధోద్యమమును జయప్రదముగ జరపెను. తిరుగు
బాటైన హైందవుల దక్షిణాఫ్రికావారు ఖైదులలో నుంచు
టయేగాక గుఱ్ఱపు కొరడాలతోఁ గొట్టియు కాల్చిచంపియు,

బెంజమిన్ రాబర్ట్సను, దక్షిణాఫ్రికాయందలి మనవారి యార్తి నివర్తనమునకై కూడిన యాప్రభుత్వ నిర్వచిత సంఘమున మన ప్రతినిధులైయుండ నియోగించెను. మఱియు రాజప్రతినిధిగారు ఇంగ్లాండులోని యధికారులకు హిందూదేశీయుల సంక్షోభమును దెలిపి వారికెక్కువ శ్రద్ధను గలుగఁజేసిరి. ఇట్లు పోరాడి హార్డింజి ప్రభువుగారు కొంతవఱకు జయప్రదులై హిందూదేశీయుల కృతజ్ఞతకుఁ బాత్రులైరి. 1914 వ సంవత్సరము మార్చినెల తే 17 దిన జరిగిన సామ్రాజ్య శాసన నిర్మాణసభయందు హార్డింజి ప్రభువు దక్షిణాఫ్రికా సమస్యను గుఱించి ప్రసంగించుచు విచారణ సంఘము వారం దధినివిష్టులైన మనవారిపై రు. 45 లు తలపన్నును రద్దుపఱచవలెననియు, హిందూదేశీయుల విషయమైన వివాహశాసనముఁ మార్చవలయుననియు, ఇతరకష్టములఁ దొలగించుట కుపాయములను దక్షిణాఫ్రికా ప్రభుత్వమువారి కుపదేశపూర్వకముగాఁ దెల్పితిమని తెలియపఱచిరి.

## స్త్రీవైద్య కళాశాల

హార్డింజిప్రభువుగారిట్లు భారతీయుల శ్రేయోభివృద్ధికై కృషిచేయుచుండఁగా వారి సతీమణియగు హార్డింజి ప్రభ్వీగారును దమ శక్తికొలఁది భారత స్త్రీల యభివృద్ధికై తోడ్పడుచుండెను. ఆమె గారొనర్చిన ముఖ్య కార్యములలో నొకటి ఢిల్లీనగరమున హిందూదేశస్త్రీలకై యొక వైద్యకళాశాలను

స్థాపింప యత్నించుట. ఆ యుద్యమమునకై హార్డింజిప్రభువు గారును దోడ్పడిరి. భార్యాభర్తలిరువురును 1914 సం॥ మార్చి నెల తే 17 దిన ఢిల్లీపట్టణమునం గట్టుట కేర్పాటు చేసిన 'రైసినా' యను ప్రదేశమునందు వైద్యకళాశాలకు శంకుస్థాపన మహోత్సవంబు జరుపుటకై విచ్చేసిరి. నాటిదినమే సామ్రాజ్య శాసన నిర్మాణసభ జరిగియుండుటచేం దత్సభ్యులును నాస్థల మలంకరించిరి. అపుడు హార్డింజి ప్రభ్విగారు శంకుస్థాపనమును జేయుటకు ముందుగా నిట్లుపన్యసించిరి. "హిందూ నాకీలోకమున కత్యంతలాభకారి కాగలదని మనః పూర్వకముగనమ్మిన న స్త్రీ వైద్యకళాశాలకు శంకుస్థాపనం జేయుమని కోరినందులకు నే నపరిమితానందము నొందితిని. ......ఇప్పటివఱకు బహుస్వల్పసంఖ్యాకులగు హైందవ బాలికలు మాత్రమే వైద్యవృత్తినవలంబించుట దురదృష్టముగ నున్నది. హైందవబాలికలు వైద్యవృత్తి నవలంబించుట కేల యిచ్చగింపరో విచారింపఁగాం బ్రత్యేకము యౌవనుల కేర్పఱచిన కళాశాలలో యౌవనులతోఁగలసి చదువుచెప్పించుటకు తల్లిదండ్రులు సమ్మతించరని తెలిసినది......కొట్టా మహారాజుగారి హితవచనముపై స్త్రీబోధకులతో నన్ని నతములకు సంబంధించిన స్త్రీలకును విద్యనొసఁగు వైద్యశాలను ధర్మ వైద్యాలయమును గట్టించిన బాగుగా నుండునని నాకు తోఁచినది. ఇయ్యది ఈ యుద్యమముయొక్క చరిత్ర. నేఁడది కార్య

రూపమును దాల్చుటకుఁ బ్రారంభమైనది." ఇట్లు చెప్పి యావైద్యశాలయొక్క వివిధోపయోగములను దానిని బాగుగ వృద్ధి చేయుటకు వలయు సాధనములను బేర్కొని ప్రజల కరతాళధ్వనులమధ్య హార్డింజిప్రభ్వి కళాశాలకు శంకుస్థాపన మొనర్చెను.

## హార్డింజి ప్రభ్వి స్వదేశగమనము

తర్వాత హార్డింజిప్రభువుగారును, ప్రభ్విగారును ఢిల్లీ నగరమునువిడచి మార్చి తే 20 ది బొంబాయినగరముఁ జేరిరి. హార్డింజి ప్రభ్విగారికి దేహస్వాస్థ్యములేమిచే నాయమ మాతృదేశమున కేగి యచట కొంతకాలము నివసించి దేహారోగ్యమును బొంది మరల హిందూదేశమునకు రావలయు నని యుద్దేశించెను. బొంబాయిచేరిన దినమున నచట పౌరశుద్ధ్యసంఘమువారును వర్తకసంఘమువారును వారినిగౌరవించుచు, స్వాగతపత్రము లర్పించిరి. మరుసటిదినమున హార్డింజిప్రభ్వి బొంబాయి రేవునొద్ద పొగయోడలో నెక్కి లండనునగరమునకుఁ బయనమయ్యెను. హార్డింజిప్రభువుగారా సాధ్వినువెంట గొంత దూరమరిగి యామెగారి సెలవుగైకొని మరల బొంబాయి నగరముఁ జేరిరి.

## హార్డింజి ప్రభ్వి పరలోకమున కేగుట

అనారోగ్యముగనుండు సతీతిలకమును దూరదేశమున వదలియుండుట హార్డింజి ప్రభువుగారి కెంతో మనోవ్యాకుల

ముగనుండినను, అపాయకరమగు నాత యనారోగ్యమేమియు లేకుండుటవలనను, సీమనుండి పలుమారు వార్తలువచ్చుచుండి నందునను, వారు కొంతమనస్స్థిమితము నందిరి. ఆమె గారింగ్లాండునకుఁ జేరిన కొద్దిదివసముల కచ్చటివైద్యులు శస్త్రచికిత్సవలయునని యుపదేశించి జూలై నెల తే 10 ది నట్లుచేసిరనియు, దాన నపాయ మేమియుఁగలుగక సుఖముగానున్నదనియు హార్డింజి ప్రభువుగారికి వర్తమానము వచ్చెను. కాని హఠాత్తుగా మరునటి రోజుననే తనప్రియసఖియగు హార్డింజి ప్రభ్వీ లండను నగరమున జూలై తే 11 దిన పరమపదించెనను హృదయభేదకరమగు దుఃఖవార్త సింలానగరముననున్న హార్డింజిప్రభు కర్ణరంధ్రముల సోకఁగానే వారు దిగ్భ్రమఁజెందిరి. 23 వత్సరముల కాలము తనకుఁ దోడునీడైయుండి, సాంఘిక రాజకీయాది విషయముల నెల్ల సన్వర్థముగా నర్ధాంగియై యుండి, తనతోఁ గష్టములను సుఖములను సమానముగ ననుభవించి తనకు విశ్రాంతి నొసంగుటకు మూలాధారముగనుండిన తనయమూల్య కళత్రముయొక్క వియోగము నెట్లుభరింపఁగలనా యని తనలోఁదాను విచారించుకొనుచు, దుఃఖసాగరనిమగ్నుండై యుండెను. మఱియు నామెయొక్క మరణ సమయమున నామె చెంతనుండి, తనకు ఢిల్లీలో నాపద సంభవించినపుడాయామె యెట్లు తనకుఁబరిచర్య చేసెనో తాను నామెకట్లుపచారము సలుపుటకు వీలులేక పోయెనుగదా యని. వారు

మిక్కిలి చింతిల్లిరి. హిందూ దేశీయులును రాజప్రతినిధిగారికి సంభవించిన తీరరాని దుఃఖమునకును భారతీయులపై నెంతో ప్రేమగలిగి నాలుగుసంవత్సరములు వారితోఁ గలసి మెలసి యుండిన ప్రభ్వియొక్క యకాలమరణమునకును మిక్కిలి విచారపడిరి. హిందూదేశ స్త్రీలును దమపై ప్రభ్విగారికిఁగల యావ్యాజానురాగమును తమ యుద్ధరణమునకై యాసాధ్వి యొనర్చిన ప్రయత్నములను స్మరించుకొనుచు సభలు చేసి హార్డింజిప్రభువుగారికి తమ సానుభూతినిఁ దెలుపుకొనిరి. చక్రవర్తినీచక్రవర్తులును, అలెగ్జాండ్రా మహారాణిగారును, వారి నోదార్చుచు వార్తలనంపిరి. ప్రభువుగారి కుమారు లిరువురును లండనులో నుండిరి. కుమారిక మాత్రము సింలాలోఁ దండ్రిగారియొద్ద నుండెను. తండ్రియుఁ గుమార్తెయు నొకరి నొకరు నోదార్చుకొనుచు దుఃఖము నుపశమింపఁ జేసికొన వలయునే కాని వారిరువురకు నాప్తబంధువు లీదేశమున నెవరున్నారు? లేరు. హిందూదేశీయులు చూపిన సానుభూతికిఁ దనకృతజ్ఞతను దెలుపుచు హిందూదేశీయుల కీ క్రిందిలేఖను హార్డింజిగారు ప్రకటించిరి.

"నాప్రియసతికి శాశ్వతమగు విశ్రాంతి నొసంగి నన్ను ను నాకుటుంబమును తద్వియోగజనితమగు విచారమునకును, దుర్భరమగు దుఃఖభారమునకును బాలుసేయవలెనని సర్వకర్తయును సర్వజ్ఞమూర్తియునగు పరమేశ్వరునికి సంకల్పము కలిగినది. ఇండియాలో నన్నిశలనుండి యన్నిజాతుల వారును

అన్నిమతములవారును దమకు హార్డింజిప్రభువుపైఁగల గాఢాను రాగమును యథార్థమగు ప్రేమను వ్యక్తీకరించుచు నాకుఁబంపిన లెక్కలేని దుఃఖోపశమన సందేశముల ద్వారా దుఃఖమున మునిగియున్న నాయెడలను నాకుటుంబమునెడలను వారు కనుబఱచినసాంద్రమగు సానుభూతికి వారియెడ నాకుఁగల కృతజ్ఞతను దెలుపఁగోరుచున్నాను. ఈమెగతించుటవలన మనఃపూర్వకముగ నాయందు దత్పరతయుండు భార్యను మిగుల నుదారశీలయగు సహకారిణిని నేను గోల్పోయితిని. ఇండియాలోని ప్రజలన్ననో తమ్ము మిగుల ప్రేమించు మిత్రమును గోల్పోయిరి. ఇండియాయందును అందలి ప్రజలందును స్త్రీలయందును, శిశువులయందును, దరిద్రులందును బాధితులగు వారి యందును ఆమెకు మిక్కిలి యనురాగ ముండెను. తనశాశ్వతమగు నావాసమునకు నామెచనినప్పటికిని ఆమెకు హిందూదేశ మందలి యనురాగ మెప్పటివలెనేయుండి యనేక శుభములకుఁ గారణమగు ననుట నిశ్చయము."

హార్డింజిగారు దుఃఖోపశమనమునకై ఇంగ్లాండునకు బోవుదురేమోయని కొందఱు ప్రజలు సందేహపడిరి. కాని, వారు తమ మనోనిశ్చయ ప్రకార మైదుసంవత్సరముల కాలపరిమితిని సంపూర్ణముగా నడపుటకై నిశ్చయించుకొనిరి.

## మహాఘోర సంగ్రామము

హార్డింజి ప్రభువుగారు భార్యావియోగ దుఃఖమునుండి తెప్పరిల్లక మునుపే ఐరోపా మహాఘోర సంగ్రామము ప్రబ

ష్ఠించి వారి మనోవ్యాకులమునకు లేశమేనియు శాంతికలుగ కుండఁజేసెను. దైవవిచేష్టితంబులు దుర్గ్రాహ్యంబులు. అఘటన ఘటనా సమర్థుండగు పరమేశ్వరుఁ డేయే చిత్రముల నొనర్చునో మనుజమాత్రు లూహించుట దుస్సాధ్యము. ఇటీవల కొంతకాల మునుండి శాంతి యనుభవించుచుఁ దన్మూలమున యావద్విషయములలో నభివృద్ధి గాంచుచుండిన యనేక ఐరోపారాష్ట్రములకు నిష్కారణముగ నచిరకాలములో నింత ఘోరసంగ్రామము తటస్థించునని యెవ రనుకొనిరి? దుష్టుఁడగు జర్మనీదేశ చక్రవర్తి సామ్రాజ్యవిస్తృతికైన దురాశాపాశబద్ధుఁడై ప్రపంచముయొక్క శాంతిని నాశనము చేయఁదలంచి 'సిరాజెవో' లోని ఆస్ట్రియా యువరాజ్ఞీరాజుల హత్యను వ్యాజముగాఁగొని ఆస్ట్రియా పక్షమవలంబించి, సర్వియా రాష్ట్రమును నాశనము చేయ యత్నించెను. జర్మనీ చక్రవర్తియొక్క దురాశాలత లింతమాత్రమేగాక తన్మూలమున నెక్కువ రాజ్యముల నాక్రమించ నేఁగఁబ్రాకెను. ఈకాంక్షను నెఱవేర్చుకొనుట కిది యదనని యాతఁడు తలంచెను. ఈ విషయ మందఱు రాష్ట్రపాలకులకుఁ దెలిసినదే. రష్యా సైతమది గమనించి సర్వియావారి పక్ష మవలంబించి యుద్ధ సన్నద్ధమయ్యె. అంతట జర్మనీవారు రష్యావారిపై యుద్ధము ప్రకటించిరి. ఫ్రెంచివారు రష్యావారి పక్షము జేరిరి. జర్మనీవారు ఫ్రెంచివారు సమర సన్నద్ధులు కాక పూర్వమే హఠాత్తుగా వారిదేశముపై దాడివెడలి ప్యారిస్

నగరమును నాశనము చేయఁదలంచి బెల్జియం దేశముగుండ సైన్యముల నడుపనీయ నారాజు నడిగిరి. బెల్జియం రాజందున కంగీకరింపక పోయెను. బెల్జియం తటస్థరాష్ట్రముగాన ఫ్రాన్సు దేశముపైకి దండెత్తుటకు జర్మనీవారు బెల్జియంగుండ పోఁగూడ దనియు, అటుల సేయకుండుటకు జర్మనీవారు వాగ్దాన మియ్య వలయుననియు, ఇదివరలోఁ గావింపఁబడిన యొడంబడికల ననుసరించి తటస్థరాష్ట్రములగుండ యుద్ధసైన్యముల నడువనిచ్చుటకు వీలు లేదనియు, బ్రిటిషువారు జర్మనీ వారికిఁ దెలియ పఱచిరి. జర్మనీ వా రట్టి వాగ్దాన మియ్యఁజాలమనిరి. అంతట జర్మనీవారిపై బ్రిటిష్ వారు యుద్ధమును బ్రకటించిరి. మన సార్వభౌముఁడగు జార్జి రాజుగారు పంపిన సందేశమున "ఈయుద్ధము కలుగకుండఁ జేయుటకును, కలహమునకుఁ దిగినవారి సైన్యముల బోఁగొట్టుటకును, అనేకవిధముల నామంత్రులు ప్రయత్నించిరి. బెల్జియముయొక్క తాటస్థ్యమునకు భంగము కలుగునపుడును, బెల్జియము దేశపు పట్టణములు నాశనమగు నపుడును, ఫ్రెంచిజాతియొక్క ప్రాణము పోవుటకు సిద్ధమైనపుడును, నా వాగ్దానములను అభయప్రదానములను ద్రోసిపుచ్చి ఐకమత్యము కలిగించుకొనక దూరమున నిలచియున్న పక్షమున, నా గౌరవము నీటిపాలై యుండును. సామ్రాజ్యముయొక్కయు మానవకోటి యొక్కయు స్వాతంత్ర్యమును బూడిద పాలు చేయుటకు శత్రువుల కొప్పగించియుందును. కాని యటులుఁ

జరుగకుండ చేయవలయునని నేను నిశ్చయించుకొంటిని."
అను మహద్వాక్యముల నుడివి యుద్ధమునకు తనంత తానే కాలు దువ్వలేదనియు, సత్యవ్రతానుసరణమునఁ బ్రవేశించవలసి వచ్చెననియు లోకమునకుఁ బ్రకటించిరి. అనివార్యమైన యీ ఘోరయుద్ధమున కాంగ్లేయ సామ్రాజ్యము యొక్క వివిధ భాగములనుండి ధనసహాయమును, సేనా సహాయమును, వస్తుసాహాయ్యమును విరివిగా రణరంగమునకుఁ బంపఁబడెను. భారతీయులు రాజభక్తిగలవారని యాంగ్లేయులలోఁ గొంద అనుకొనినను, కొందఱుమాత్ర మింతకుఁ బూర్వము దానిని విశ్వసింపని వారుండిరి. మఱియు హిందూదేశ సైన్యము లదివరకెన్నడును, ఐరోపాఖండమునకు యుద్ధమునకై పంపఁబడలేదు. కాఁబట్టి యుద్ధరంగమునకుఁ బోవుటకు సంసిద్ధులైన భారతీయసైనికులు తమ కనుజ్ఞ యిత్తురో లేదో యని సంశయించుచుండిరి. స్వదేశసంస్థానాధీశులు తమ సామ్రాజ్య సైన్యముల రణరంగమునకుఁ బంపుటకు సిద్ధముగ నుండిరి. ప్రజలలో ననేకులు ప్రభుత్వమువారికి శక్తివంచన లేక సహాయము చేయుదుమనిరి. మహారాజు లనేకులు లక్షలకొలఁది రూప్యముల యుద్ధవ్యయములకై యర్పించిరి. అంతియగాక స్వదేశాధిపతులు తమసంపదలను, శరీరములను, సైన్యములను సామ్రాజ్యసంరక్షణమునకై సమర్పింప సన్నద్ధులుగ నున్నటులు రాజప్రతినిధిగారికిఁ దెలియఁజేసిరి. శ్రీహార్డింజి ప్రభువు

గారు హిందూదేశీయుల రాజభక్తిని స్వదేశసంస్థానాధిపతుల విరాళములను దెలుపుచు సొంపగువాక్యములలోనిమిడ్చి యొక సందేశమును పార్లమెంటువారికిఁ బంపి హిందూదేశ సైన్యముల రణరంగమునకుఁబంప తీర్మానించితినని ప్రకటించిరి. వారి సందేశము పార్లమెంటులో ప్రచురముచేయఁగా తత్సభ్యులే గాక, ఆంగ్లేయ దేశమంతయు విస్మయానందములతో నిండి పోయెను. హిందూదేశీయుల తత్త్వమాంగ్లేయులకు నాఁడు వ్యక్తమయ్యెను. హైందవసైన్యములు రణరంగమునకుఁ బంప బడుననువార్త భారతీయులకు మిక్కిలి సంతోషమును గలుగఁ జేసెను. ఇంగ్లాండులోని పౌరులు "భారతీయులు తమరాజభక్తి నద్వితీయముగ లోకమునకుఁ బ్రకటించిరి. కాన వారి కిఁక మీఁద నెక్కువ స్వాతంత్ర్యముల నియ్యవలయు" ననిరి. హిందూదేశము పేరు వినని యాంగ్లేయులకు సహా రాజప్రతినిధిగారి సందేశమువలన హిందూదేశమను పేర సామ్రాజ్యాభరణమైన విశాలదేశమున్నదనియు, అందు తమతో యుద్ధరంగంబున సమానముగ నిలచి శత్రువులతోఁ బోరాడఁగల యోధులున్నారనియు గోచరమయ్యెను. ఎచ్చట చూచినను వారి సందేశమే ప్రస్తావములో నుండెను. అట్టి సందేశముపంపి భారతీయులపై నాంగ్లేయుల కుదారభావము జనింపఁజేయుటయేగాక హార్డింజి గారు యుద్ధసహాయనిధులను స్థాపించి యుద్ధమువలనఁ బలువిధముల బాధలకులోనగు దీనులఁబోషింప యత్నించిరి.

# అన్యోన్య సాహాయ్యబోధ

హార్డింజి ప్రభువర్యుఁడు సెప్టెంబరునెల తే 8 దిన సింలా నగరమున సమావేశమైన సామ్రాజ్యశాసన నిర్మాణసభయందు ఘనోపన్యాసమొసంగి యందు యుద్ధమును గుఱించియు హైందవ స్వాతంత్ర్యమును గుఱించియు మృదుమధుర వాక్యముల నుపన్యసించి భారతీయుల మనముల వశీకరణము జేసికొనిరి. ఆంధ్రదేశమం దెల్లెడల వ్యాపించి యాంధ్రుల పురోభివృద్ధికై పాటుపడుచున్న ఆంధ్రపత్రిక, ఈ యుపన్యాసముపై, ఇట్లు వ్రాయుచున్నది. "నిన్నటిదినము సింలానగరమున సమావేశమైన మన సామ్రాజ్యశాసన నిర్మాణసభ కధ్యక్షతవహించి యితఁడొసంగిన యుపన్యాసమున పల్కిన పలుకులు, వెలిబుచ్చిన భావములు, విక్టోరియా మహారాణిగారి మహాసందేశమువలెను జార్జిచక్రవర్తిగారి యుదారవాక్యజాలమువలెను, ఈ ప్రభువుగారి యొక్కయే 1912 వ సంవత్సరపు ప్రకటనవలెను, మన దేశచరిత్రమున పరంపరముగా శిలాశాసనముగ జ్ఞాపకముంచుకొని గౌరవింపఁదగినవై యున్నవి." ఇదెంతయు సత్యము. ఈయుపన్యాసమున దక్షిణాఫ్రికా, కెనడాదేశములలో హైందవుల పౌరత్వస్వామ్యములను గూర్చి విశేషముగ ముచ్చటించి వలసరాజ్యములకు సంబంధించిన వ్యవహారములలో వినిమయత్వ న్యాయప్రకారము పరస్పరసాహాయ్యపద్ధతి నవలంబించిన మనయత్నములు త్వరలో సఫలీకృతమగుననిరి.

## జ్యేష్ఠపుత్రుని వీరస్వర్గప్రాప్తి

ఐరోపా మహాసంగ్రామమున నింగ్లాండులోని గొప్ప గొప్ప వారసేకులు యుద్ధసన్నద్ధులై రణరంగముఁ జొచ్చిరి. మన హార్డింజి ప్రభువుగారి జ్యేష్ఠకుమారుఁడగు మాననీయులు లెఫ్టినెంటు ఇ. సి. హార్డింజిగారు 15 వ హుస్సారుల పటాలమున లెఫ్టినెంటుగా నుండిరి. వారు ఫ్రాన్సుదేశమున యుద్ధరంగమున జూపిన ధైర్యసాహసములకు వారి పై యధికారులు మిక్కిలి మెచ్చుకొనిరి. ఆసమయమున శత్రువుల మరఫిరంగి వలన వారి రెండు చేతులగుండను ఇతరభాగములగుండను ఫిరంగి గుండ్లు దూరుకొని పోయినవి. అట్టిసందర్భమున సైతము తనకు నియమింపఁబడిన పనిని జయప్రదముగ నాశూరుఁడొనరించి యధికారుల మెప్పు వడసెను. గాయమును మాన్పించుటకై యుద్ధవైద్యాలయమున కాతనిఁజేర్చిరి. జార్జిచక్రవర్తిగా రాశూరుని శౌర్యాతిరేకమునకు మెచ్చి వారికి డి. యస్. ఓ. అను బిరుదము నొసంగి గౌరవించిరి. గాయములు నయమగుననియు భయపడవలదనియు తండ్రిగారికి వర్తమానములు వచ్చుచుండెను. కాని మనమొకటి తలఁచిన దైవము తానొకటి తలచు నను సామెత యథార్థమయ్యెను. హార్డింజి ప్రభువుగారి పుత్రరత్నము డిసంబరునెల తే 18 ది వీరస్వర్గము సందెనను పిడుగువంటి వార్త తండ్రిగారికి తెలిసెను. భార్యావియోగ దుఃఖమునుండి తెప్పఱిల్లకుండిన యామహాశయునికి

జ్యేష్ఠపుత్ర వియోగదుఃఖభారమెంత సహింపరానిదిగ నుండెనో యూహింప దుస్సాధ్యము. ఎంత ధీరచిత్తుండైనను నాపత్పరంపరలకుఁ జలింపకుండునా? ఈ ప్రభువర్యునకు వచ్చిన గండములకును ఆపదలకును మితిలేదు. మొదట కళత్ర సమేతులై యున్నప్పుడు తమపై ఢిల్లీలో బాంబుపడి, తర్వాత భార్యను గోల్పోయి, పిదప సామ్రాజ్యమునకు వ్యాకులమును గలిగించిన మహాఘోర సంగ్రామము తటస్థించి యందు జ్యేష్ఠపుత్రుని రణరంగమున కర్పించెను.—ఇవన్నియు నొకటి వెనుక నొకటి యతి శీఘ్రకాలములో సంప్రాప్తమై హార్డింజి ప్రభుప్రయొక్క ధీరత్వమును పరీక్షింపసాగినవి. కాని యాధీరుండు శాంతముగ నన్నియు భరించి హైందవప్రజల యవ్యాజ సానుభూతిచే తన దుఃఖమును కొంత మఱచి తన ధర్మముల వదలక పరిపాలనము జఱుపుచుండెను.

## పరిపాలనా నియమిత కాలవృద్ధ్యభిలాష

1914 వ సంవత్సరము జూన్ నెల తే 20 దిన నీభరత ఖండమున హార్డింజి ప్రభువుగారి జన్మదినమహోత్సవసమయమున జరిగినసభలలో భారతీయులు హార్డింజి ప్రభువుగారి యందుఁగల దృఢవిశ్వాసమును మరియొకవిధమున లోకమునకుఁ బ్రకటించిరి. వారి పరిపాలనా పరిమితికాలము త్వరలో ముగియును గాన వారు ప్రారంభించిన యుపయోగకరములగు సంస్కారములను బూర్తిచేయువఱకు వారినే హిందూదేశ రాజప్రతినిధిగా

నుంపుఁడని శ్రీచక్రవర్తిగారిని ప్రార్థించిరి. ఇదియును హార్డింజిగారి సత్పరిపాలనాఫలమే. ఇప్పటికీదేశమున కెందఱో రాజప్రతినిధులు వచ్చిరి; పరిపాలించి వెళ్ళిరి; కాని ఈలాటి యపూర్వగౌరవముఁ ప్రజలనుండి పొందినవార లరుదు. పైనఁ బేర్కొనినట్టి సభలలోనొకటి సింలానగరమునందు జరిగెను. అపుడగ్రాసనాధిపత్యము వహించియుండిన రాజా సర్ హర్నాంసింగుగారిట్లు ప్రసంగించిరి. "హార్డింజి ప్రభువరుఁడు చేసిన ప్రతికార్యమువలనను ఆయన మన కృతజ్ఞతకుఁ బాత్రుఁడగుటయే కాక, మన వాంఛలనుగూడఁ బెంపొందించెను. ఏలయనఁగా, ఇంకను బరిష్కరింపవలసిన వ్యవహారములు చాలఁగలవు. కొన్నిటిని విశద పఱచెదను. రాజకీయోన్నతోద్యోగశాఖ (పబ్లికు సర్వీసు) ను గూర్చి విచారించుటకు సభ యేర్పరుపఁబడినది. ఇంకను విచారణలు జరుగుచున్నవి. ఈ సభవారి నివేదన మెప్పుడు వచ్చునోయని యాతురముతోఁ బ్రతీక్షించుచున్నాము. నివేదనము వచ్చిన తర్వాతకూడ దానిపై యుత్తరువులు వచ్చుటకుఁ జాలకాలము పట్టును. భారతీయులు బ్రిటిషువారి యధినివేశములను వలసపోవు విషయము పరిష్కరింపఁబడవలయును. ఇది పెద్ద కొండవంటి వ్యవహారము. ఇంతకన్న ముఖ్యమగు వ్యవహార మింకొకటి లేదని నాయభిప్రాయము. ఈ వ్యవహార పరిష్కారముపై ననేకవిషయము లాధారపడియున్నవి. ఆర్థిక విచారణసంఘము (కరెన్సీ కమీషను) వారి నివేదనపత్రమును

గూర్చి యాలోచింపవలసియున్నది. ఎన్నటికిని పరిష్కారము కాని న్యాయనిర్ణయ, ప్రభుత్వకార్యనిర్వహణ (జూడిషియల్ ఎగ్జిక్యూటివ్) శాఖల విభజనవిషయము తీర్మానము చేయ వలసియున్నది. ప్రభుత్వాధికార విభాగ విమర్శనమునకై చక్ర వర్తినియుక్తసభ (రాయల్ డీసెంట్రలైజేషను కమిటీ) వారి యుపదేశముల ననుసరించి స్థానిక పరిపాలనలో కొన్ని మార్పులు జరుగవలసి యున్నవి. ఇండియా దొరతనమువారి కార్యనిర్వా హకసభ (ఎగ్జిక్యూటివ్ కౌన్సిలు) ను విస్తరించవలయునను విషయము ఆలోచనలోనున్నది. మనదేశములో నింకను చక్కఁ జేయవలసిన వ్యవహారములు చాలఁగలవు. ఈ విషయములు నానాటికిఁ జిక్కగుచున్నవి. నేను పైనఁజెప్పిన ముఖ్యవ్యవహా రము లన్నియు, అన్నిగాక పోయినను చాలభాగము, పరిష్క రింపఁబడు వఱకైనను హార్డింజి ప్రభువరు నిండియాలో నుంచ వలయునని మేము కోరుచున్నాము.'' ఒక్క సింలా నగరము ననే గాక లాహోరు, ఢిల్లీ, నాగపురము మొదలగు ముఖ్య పట్టణములలో నెల్లఁ బ్రజాప్రముఖు లిదే యభిప్రాయమును వెలిఁబుచ్చిరి. మఱియు నిపుడు జరుగుచున్న మహాసంగ్రామ మున నాంగ్లమిత్రమండలి వారు జయప్రదులైన పిమ్మట హిం దూదేశీయుల కెక్కువ స్వాతంత్ర్యముల నాంగ్లేయ పరిపాలకు లొసంగుదురనెడి యభిలాష నొకటి భారతీయుల హృదయ ముల నాక్రమించియున్నది. కాని [illegible] [illegible]

నపు సుదారహృదయులగు హార్డింజిప్రభువు రాజప్రతినిధిగా నున్న నెంతో సాహాయ్యకారిగా నుండునని ప్రజలనమ్మకము. కావున డిసెంబరు నెలలో మదరాసునందు బాబు భూపేంద్ర నాథ వసుగారి యాజమాన్యము క్రింద జరిగిన హిందూదేశీయ మహాజనసభవారు హార్డింజిప్రభువుగారి పరిపాలనాపరిమితికాలమును పొడుగించవలసినదని శ్రీచక్రవర్తిగారిని గోరుచు నొక తీర్మానము నేక గ్రీవముగా నంగీకరించుచు, హైందవావళి యొక్క యభిప్రాయమును స్పష్టముగఁ దెలియఁ బఱచిరి. హిందూదేశీయ మహాజనసభ జరిగిన పిమ్మట సైతము ప్రజా ప్రముఖు లచ్చటచ్చట సభలు చేసి, ఈ కోరికయే హైందవ ప్రజలయందు బలవత్తరముగ నున్నదని, ఆంగ్లదేశ ప్రజలకును మంత్రివర్గమునకును దెలియపఱచిరి. 1915-వ సంవత్సరము, ఏప్రల్ నెలలో కలకత్తా, బొంబాయి, మద్రాస్ మున్నగు గొప్ప పట్టణములలో నట్టి సభలు సమావేశమాయెను. సందర్భానుసారములనుబట్టియు హైందవ ప్రజాభిప్రాయమున కనుగుణముగను, హార్డింజి ప్రభువుయొక్క రాజప్రాతినిధ్యావధి స్వల్పముగ హెచ్చించి నట్లు ఆంగ్లరాజ్యాంగ ప్రధానమంత్రి యగు ఆస్క్విత్ మహాశయుఁడు 1915-వ సంవత్సరము జూన్ నెల 14-వ తేదిన ఇంగ్లాండులోఁ బ్రచురించెను. ఆ నరుసటి దినముననే హిందూ దేశమునందు, ఈ వర్తమానమును హార్డింజి ప్రభువర్యుఁ డిట్లు ప్రకటించెను. "ప్రజాప్రాతినిధ్య సమయోఁ

ప్రధానమంత్రిగారీ క్రిందఁజెప్పిన విధమున బహిరంగ పఱచిన విషయమును భరతఖండమునఁ బ్రచురింపుమని (సెక్రిటరి ఆఫ్ స్టేట్) హిందూదేశ మంత్రిగారు నాకు వర్తమాన మంపిరి:—

'సాధారణ సందర్భములలో, హార్డింజి ప్రభువుగారి పరిపాలనా కాలపరిమితి నవంబరు మాసమునం దంత్యము గావలయును. కాని, వారు హిందూదేశమునం దొనర్చిన ఘనకార్యములను గమనించియు, రాఁబోవు శీతకాలమువఱకును వారి యనుభవ లాభమును హిందూదేశ పరిపాలనయం దుపయోగించుకొనఁ దలఁచియు, వారినే రాఁబోవు మార్చినెల తుదవఱకు రాజ ప్రతినిధిగ నుండుఁడని గవర్నమెంటువారు కోరియున్నారు. వారందులకు సంతోషపూర్వకముగ సమ్మతించిరి; సార్వభౌములును, ఈ యేర్పాటును దయాపూర్వకముగ నంగీకరించిరి. ఎడతెగక పరిపాలనాకార్యముల నింత సామర్థ్యముతో నింత కాలము కొనసాగించు భారమును వహించియు, గొప్పకుటుంబ దుఃఖములకులోనయ్యు, నింకను దన సేవను మన యధీనము నందుంచునట్లు చేసిన, వారి ప్రబలమైన కర్తవ్యతా పరిజ్ఞానమును నేనెంతయు మెచ్చుకొనుచున్నానని చెప్పుటకీ యవకాశము లభించినదని మిక్కిలి సంతసించుచున్నాఁడను.' ప్రధాన మంత్రిగారి పై ప్రకటనమును హిందూదేశమున బహిరంగపఱుపుమని కోరిన హిందూదేశ మంత్రిగారి యభిలాషను నెరవేర్చుచు నేనొకమాట చెప్పఁదలఁచితిని. ఆంగ్లసామ్రాజ్యము సంగ్రామావస్థలోనున్న, ఈతరుణమున, సార్వభౌము ప్రభుత్వము

వారి కోరికప్రకారము నడచుట విధ్యుక్త ధర్మమని నాకుఁ దోచినను, రాజప్రతినిధిబాధ్యత వహించి యొనర్చవలసిన వివిధ కార్యముల నింకను గొంతకాలము నిర్వహించుట, అంత సంత సము గలిగించునదియును చులకనమైనదియునుగా భావింప లేదు. కాని, హిందూదేశమందలి సంస్థానాధిపతులును ప్రజా నాయకులును నాపరిపాలనా కాలపరిమితి వృద్ధికై వ్యక్తీక రించిన యభిలాషను నేను మరువను. ఇందలి స్నేహసూచక మగు విశ్వాసము నాయందుఁ గలదనుభావమే నే నింకను గొంతకాలము శక్తికొలఁది హిందూదేశముయొక్కయు దేశీ యులయొక్కయు శ్రేయోభివృద్ధికై కృషిసల్పి, నాధర్మముల నెరవేర్చుటకు నాకు ధైర్యము నొసంగుచున్నది." ఈప్రచు రమునకు భారతీయులును, భరతఖండమునందలి వార్తాపత్రి కాధిపతులును, తమ సంతోషమును వెలిబుచ్చిరి. ఈప్రచురణ మైన కొలఁది దినములకే, అనఁగా జూన్ నెల 25 వ తేదిన హార్డింజిప్రభువు జన్మదివసమురాఁగా, నాఁడు హైందవప్రజా నాయకు లచ్చటచ్చట సభలు జరిపి, వారి గుణగణములను స్తుతించిరి. కలకత్తానగరమందు నాఁడు జరిగిన సభలో సర్ గురుదాస్ బనర్జిగారొక మహోపన్యాసమిచ్చి హైందవాభి ప్రాయమును బాగుగ వ్యక్తీకరించిరి.

సంయుక్తపరగణాల కార్యనిర్వాహక సభ

వీరిపరిపాలనమునఁ జేయఁబడిన సత్కార్యములలో నొకటి సంయుక్తపరగణాల పాలకునికి సచివసంఘమును [illegible]

మించుటయై యుండెను. రాష్ట్రపరిపాలకులకుంబోలె పరగ ణాలవంటి చిన్నరాష్ట్రముల పాలకులకుంగూడ సచివసాహాయ్య ము సమకూర్చుచో నొక్కరి నిరంకుశాధికారమునంగాక సభాభిప్రాయముపైఁ బరిపాలనము జరుగుట కనుకూలించునని యు, ఆసభలో నాంగ్లదేశీయులతోఁగూడ భారతీయుఁ డొక డుండిన హైందవాభిప్రాయము సభలో వ్యక్తీకరింపఁబడు ననియు, గమనించి, ఈ సంస్కార మత్యవసరమని హార్డింజి ప్రభువుగారు, ఆంగ్లప్రభుత్వమువారికిఁ దెలియఁ జేసిరి. సభా యుతుఁడగు హిందూదేశ మంత్రిగారును ఆంగ్లసామ్రాజ్య ప్రభుత్వమువారును ఈమార్పునకు సమ్మతించిరి. ఆచారాను సారముగా నీవిషయమున ప్రభుసభవారి యామోదముఁబడయ గోరిరి. కాని వారేలార్డ్సు ఈతీర్మానము నంగీకరించరాదని సార్వభౌమునకు నివేదించిరి. అంతటితో నీ సంస్కారము కొన సాగక తాత్కాలికముగ నిలుపవలసి వచ్చెను. ఈవర్తమా నము హార్డింజిప్రభువుగారికిఁ దెలియఁగా వారు మిక్కిలి చిం తించిరి. హిందూదేశీయులును ముఖ్యముగా సంయుక్త పరగ ణాలలోని హైందవులును ప్రభువుల సభవారి చర్య మిక్కిలి అన్యాయ్యమనియు, అక్రమమనియు, తమ కోపమును వెలి పుచ్చుచు ననేకసభలుచేసి, తమ యభిప్రాయముల నాంగ్ల దేశమునకుఁ దెలియపఱచిరి. 1915-వ సంవత్సరము మార్చి నెల 25-వ తేదిన జరిగిన సామ్రాజ్యశాసననిర్మాణసభయందు,

ఈ విషయమునుగూర్చి హార్డింజి ప్రభువర్యుడిట్లు ప్రస్తావించెను. "ప్రభువులసభలో 650 మంది సభ్యులుండగా, నాటి సమావేశమునకు 73 మంది ప్రభువులు మాత్రము విచ్చేసిరనియు, అందులో 47 మంది నా ప్రణుతార్థమునకుఁ బ్రతికూలురుగను, 26 మంది అనుకూలురుగను, అభిప్రాయములఁ దెలిపిరనియు నాకు తెలియవచ్చుచున్నది. ప్రజాప్రాతినిధ్య సభలో నీవిషయము చర్చకు వచ్చినట్లు కానరాదు...... భారతీయ ప్రజాభిప్రాయానుసారముగనుండి భారతీయప్రభుత్వము వారిచేతను ఆంగ్ల దేశములోని సార్వభౌమప్రభుత్వము వారిచేతను అంగీకరించఁబడి విజ్ఞప్తమైన ఈ యవసరమగుమార్పును, ఇటీవల హిందూదేశములోఁ బ్రజాభిప్రాయములలో నెట్టియభివృద్ధి గాంచుచున్నదియు బొత్తిగాఁదెలియనట్టి స్వల్ప సంఖ్యాకులగు ప్రభువులు కొందఱు సభలోచేరి, మా ప్రణుతార్థమును నిరాకరించుటచూడగా, మీకును నావలెనే మిక్కిలి మనోవ్యాకులము కలిగి, భవిష్యదభివృద్ధినిగూర్చి సంశయము కలుగవచ్చును. ఇటువంటి సందర్భములలో ఇకమీదటనైన నిట్టి అక్రమములు జరుగుట కవకాశమియ్యకుండునట్టి విధముగా రాజ్యాంగశాసనమును మార్చుటయే అత్యవసరమని నాకు స్పష్టముగఁ దోచుచున్నది. ఈముఖ్యాంశమును సార్వభౌమప్రభుత్వము వారును గమనించెదరని నమ్ముచున్నాను. నాగరకతయం దభివృద్ధిగాంచుచు, చిక్కుగల వివిధ

విషయములను జర్చించి తీర్మానింపవలసిన అవసరము నానాటి కధికమగుచున్న ఈకాలమున, సభాయుతులై చర్చించి తీర్మానించు పరిపాలనాపద్ధతికంటె, నిరంకుశుడగు నొక్కని పరిపాలనా పద్ధతియే శ్రేష్టమైనదని, సహేతుకముగ నెవ్వరును వాదింపజాలరు. సభాయుతులై కార్యమును నిర్వహించు పరిపాలనాపద్ధతి హిందూదేశమున నాటుకొనినది; దాని నిపుడు పెకలింపజాలరు. మఱియు కార్యాలోచన సభలలో భారతీయుం డొకండుండు టెంతయు నుపయోగకరమనియు నవసరమనియు స్వానుభవముచే నే జెప్పగలిగి యున్నాను. ప్రభువుల సభవారిప్పుడొనర్చిన, అవివేక కార్యమువలన, భారతీయుల కాశాభంగము కలిగినది. కాని ఇప్పుడు ప్రభువులొనర్చిన తీర్మానము తాత్కాలికమనియు, త్వరలో తప్పక నెరవేరుననియు, మీరు నిరుత్సాహము నొందవలదనియు, నేను చెప్పుచున్నాను." భావగర్భితములగు ఈ వాక్యములు ప్రజల మనస్సంతాపమును గొంతవఱకుజల్లార్చినవి.

## సామ్రాజ్య సభాప్రాతినిధ్యము

ఈ సంవత్సరము సెప్టంబరునెల 22-వ తేదిన హార్డింజి ప్రభువర్యుని యాజమాన్యమున జరిగిన సామ్రాజ్య శాసననిర్మాణసభలో మాననీయులగు మహమ్మదు మియాన్ షాఫిగారీతీర్మాన ముపపాదించిరి:—"సామ్రాజ్యసభయందు నిక మీదహిందూదేశమునకు సక్రమాధికార ప్రాతినిధ్యము నొసం

గూడనిరొత్తిడి సూచించుచు విజ్ఞాపనమును హిందూదేశమంత్రి మూలముగా నాంగ్లసామ్రాజ్య మంత్రివర్గము వారికి పంపుడని సచివ సర్వపాలకాధ్యక్షులకీసభవారు నివేదించుచున్నారు.” ఇదివరలో నాంగ్లసామ్రాజ్యమున కంతకు సంబంధించిన వ్యవహారముల నాలోచించి పరిష్కరించుటకు, ఆంగ్లసామ్రాజ్యములో జేరి స్వపరిపాలనాధికారము కలిగియున్న “యునైటెడ్ కింగ్డం, కనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా, న్యూజిలాండు వంటి దేశములయొక్క ప్రతినిధు లాంగ్లదేశమునందొకచో సమావేశ మగుచుండిరి. సాధారణముగ నాయాదేశ మంత్రులీసభకు విచ్చేయుచుండిరి. 1907 వ సంవత్సరమం దీసామ్రాజ్యసభ సమావేశమైనపుడు, నాల్గుసంవత్సరముల కొకపర్యాయ మీసభ కూడవలయుననియు, ఆయాదేశమంత్రు లీసభకు సభ్యులనియు, తీర్మానించిరి. ఆంగ్లరాజ్యాంగ ప్రధానమంత్రిగా రీసభ కధ్యక్షులుగ నుండిరి. 1907 వ సంవత్సరముననను 1911-వ సంవత్సరముననను, ఇంగ్లాండులోనున్న హిందూదేశ మంత్రిగా రీ సభలకు వెళ్లిరి కాని హిందూదేశమునకు స్వపరిపాలనాధికారము లేకపోవుటచే నాడు హిందూదేశ ప్రతినిధిగా నుండుటకు వీలులేకపోయెను. ఈసభయందే దేశములకు ప్రాతినిధ్యముండవలయునో, తీర్మానించు నధికారము సభవారికే కలదు. హిందూదేశమునకును ఆంగ్లసామ్రాజ్యములోఁ జేరిన ఇతర దేశములకును సంబంధించిన వ్యవహార

ములనేకము లుండును. వానిని సామ్రాజ్యసభలో చర్చించు నపుడు నియమనియుక్త హైందవ ప్రతినిధులకందు స్థానమిచ్చుట న్యాయము, అత్యవసరము. కావున మాననీయులగు షాఫిగారీ తీర్మానము నుపపాదించుచు హైందవ ప్రాతినిధ్యమునకుగల కారణములన్నియు నొక్కి వక్కాణించిరి. ఉదారహృదయుఁ డగు హార్డింజిప్రభువు షాఫీగారి తీర్మానపు సారాంశమును ముందుగనే, ఆంగ్లమంత్రివర్గము వారికిఁ దెలిపి వారి యంగీకారమును బడసి, నాఁటి సామ్రాజ్యశాసన నిర్మాణసభలో షాఫీగారి తీర్మానమును ప్రభుత్వపక్షమున నంగీకరించుచున్నా నని చెప్పిరి. ఈతీర్మాన మంగీకృతమగుటయే గాక, త్వరలో నాచరణకు వచ్చినదనియు, 1917-వ సంవత్సరములో సర్ సత్యేంద్రప్రసన్న సింహాగారును, బికనీరు మహారాజాగారును, సర్ జేమ్సు మెస్టన్‌గారును, 1918-వ సంవత్సరమున సర్ సింహాగారును, పాటియాల మహారాజాగారును, సామ్రాజ్య సభలకు హిందూదేశప్రతినిధులుగ వెళ్లి హిందూదేశీయుల స్వామ్యములను సభ్యులకు నివేదించి తమ కర్తవ్యములను శ్లాఘనీయముగ నొనర్చిరనియు ఎల్లరకు దెల్లము. ఆంగ్లసామ్రాజ్యమును గాపాడుటకై మహాఘోరసంగ్రామమునందుఁ ప్రవేశించి లక్షల కొలది సేనలను ద్రవ్యములను అర్పించి రణరంగ కౌశల్యమును లోకమునకు జాటించిన పిమ్మటనైన హిందూదేశమునకీ స్వల్పస్వామ్యము నొసంగుటయం దాశ్చర్య మేమియు లేదు.

కాని యిందులకుఁ దోడ్పడిన రాజప్రతినిధియగు హార్డింజి ప్రభుప్ర మాత్రము ప్రశంసాపాత్రుఁడు.

## కాశీ విశ్వవిద్యాలయము

ఈ సంవత్సరము, అక్టోబరు నెలలో జరిగిన సామ్రాజ్య శాసన నిర్మాణసభయందే కాశీవిశ్వవిద్యాలయ శాసన మంగీ కృతమాయెను. ఈహిందూవిశ్వవిద్యాలయ స్థాపనమునకై శ్రీ దుర్భంగా మహారాజులుంగారును శ్రీయుత పండిత మదనమో హన మాలవ్యగారును, శ్రీయుత డాక్టరు సుందరలాల్‌గారును శ్రీకాశీ మహారాజులుంగారును, ఇంక నెందరో శ్రీమంతులును దేశాభిమానులును పలుమారు సమావేశమై విధానముల నా లోచించి, తమ కాలమును శక్తిని ధారపోసి, గ్రామగ్రామము లకు తిరిగి శ్రీమంతుల దర్శించి లక్షలకొలఁది ధనమార్జించి, ప్ర భుత్వమువారి యనుజ్ఞకై కృషిసల్పి నాలుగు సంవత్సరముల కాలము పరిశ్రమజేసి నేటికి సఫలీకృత మనోరథులైరి. హార్డిం జి ప్రభువరుఁడీ విశ్వవిద్యాలయ స్థాపకులకు తగినంత ప్రో త్సాహ మొసంగి, చట్టమునం దెంతధారాళమైన స్వామ్యముల నియ్యవీలగునో యుదారబుద్ధితో నాలోచించి సహాయపడెను. మరియు హిందూదేశమును వారు వదలిపోవులోపలనే విశ్వవి ద్యాలయ భవనములకు శంకుస్థాపనము వారిచేతనే చేయించ వలెనను కోరిక గలిగిన విశ్వవిద్యాలయ స్థాపకుల ప్రార్థనను సహిత మంగీకరించిరి. ఈశంకుస్థాపన మహోత్సవము

1916-వ సంవత్సరము ఫిబ్రవరి నెల 4-వ తేదిన హిందూపుణ్య క్షేత్రమగు కాశీనగరమున నెంతో విభవముతో జరిగెను. వివిధసంస్థానాధిపతులును శ్రీమంతులును దేశాభిమానులును ప్రజానాయకులును, ఆంగ్లోద్యోగియులును, వంగరాష్ట్రాధిపతి యు, కనిష్టరాష్ట్రపాలకులును, నాఁటి సభాభవనము నలంకరిం చిరి. హిందూమతాచార ప్రకారము యథావిధి శంకుస్థాపన మహోత్సవము జరిగెను. హార్డింజి ప్రభువుగారు పునాది రాతిని స్థాపించిన పిమ్మట విశ్వ విద్యాలయ స్థాపకుల ముఖ్యాభిప్రా యములం జేర్కొనుచు నుపన్యసించిరి. అపుడిట్లు చెప్పిరి. "ఉన్న త విద్యాభివృద్ధి కిపుడున్న దాని కన్న నెక్కువ సౌకర్యముల నిచ్చుటయే కాక మఱియు విశేషాంశము లీ విశ్వవిద్యాలయము నందుఁ గలవు. కాళాశాలలను జేర్చుకొనుచు బాలుర పరీక్షిం చుచు నుండు విశ్వవిద్యాలయములవలె గాక ఇయ్యది బాలు రకు విద్యనేర్పునట్టియు పాఠశాలలయందే ఉపాధ్యాయులు శిష్యయుతముగా నివసించుటకు వీలు కలిగించు నట్టియు విశ్వ విద్యాలయమై యుండును. మీకిది నవీన పద్ధతిగా నుండవచ్చు ను కాని ప్రాచీనులగు వివేకవంతు లీ పద్ధతి మంచిదని యిది వరకే గ్రహించియుండిరి. అయినను ప్రాచీన విశ్వవిద్యాలయ ములం దీ పద్ధతి సంపూర్ణముగ నాచరణీయముగా లేదు. ఈప ద్ధతి క్రొత్తదని చెప్పుటలో నేను బహుశః పొరఁబడితిని గా బోలు. ప్రాచీన భరతవర్షమునం దిప్పటివలె నవీనాభిప్రాయ

పూర్వమగు విశ్వవిద్యాలయము లేకున్నను, ఇదే విధముగ విద్యాదాన పద్ధతి యుండెను. గురువర్యులగు వసిష్ఠుఁడు గౌతముఁడు మున్నగు మహర్షులు శిష్యసహస్ర పరివృతులై వారికి విద్యాబుద్ధులు గఱపుచు మతబోధ జేయుచు కులపతులనఁ బ్రఖ్యాతులై యుండిరి. (అయిదు నూఱుల శిష్య గణముగల వానికిఁ గులపతి యనిపేరు.) శిష్యులు గురువర్యులా దర్శముగ, సత్ప్రవర్తనముగలిగి మెలంగుచుండిరి. ఇట్టి విద్యా దాన పద్ధతులకును నాచేతనైన సహాయము చేసితిని. హిందువు లును మహమ్మదీయులును ప్రత్యేకముగ వారివారి మతసిద్ధాం తముల ననుసరించిన విద్యాదానపద్ధతుల నూతన విశ్వవిద్యాల యముల స్థాపించు కొనదలఁచి, యత్నములు సల్పుచున్నపుడు, వారికి తోడ్పడుటయే ధర్మమనియు, ఆటంకములు కలుగజేయ రాదనియు, నేనును నాసభవారును తీర్మానించు కొంటిమి. వి ద్యాదానమునకైన ఈ సశిష్యసన్నివిష్టోపాధ్యాయ విశ్వవిద్యా లయము నూతనమైన దైనను ప్రాచీనమైనదైనను ప్రకృత ముండు విశ్వవిద్యాలయము లట్టివికావు గనుక ఈ దేశమందిది క్రొత్తదిగనే యున్నది. అయినను దీనివలననే మహాలాభము చేకూరుననని నే చెప్పఁజాలనుగాని మత సంబంధమైన దీనిపేరు నకు మాత్రము నేను ప్రాముఖ్యము నిచ్చుచున్నాను. దీని ఉత్పత్తి కదియే ప్రాణాధారము...... ఒక్కొక్క మతము వారికి సంబంధించిన ప్రత్యేక విశ్వవిద్యాలయము లుండుటకు,

రిప్పన్ ప్రభువు సమ్మతించక పోవుటయు వివేకమే. వివిధమత ములవారును జేరి కలసి మెలసి యొకచోటనే ప్రవర్తించుట జాతీయాభివృద్ధికి సాధనమే అయినను రిప్పన్ ప్రభువుగారు నియమించిన విద్యావిధాన నిర్ణయసంఘమువారు భిన్నమతము లకు సంబంధించిన విశ్వవిద్యాలయము లుండవచ్చునని సహి తము సూచించి యున్నారు. అటులు సూచించియు నందుగల లోపములను సహితము పేర్కొనియున్నారు. అయినను మతా సహిష్ణుత ప్రబలునను బూటకపు మాటలకు నేను జంకువాఁడ నుగాను. ఏమతమునం దైనను నొకరికి గాఢమైన ప్రేమయుండి ఆమతసిద్ధాంతముల ననుసరించి నడచుకొను మనుజుని హృద యము, మతాంతరములకును దగిన మర్యాదఁ జూపవలె ననెడి భావములనే పెంపొందింపవలెను కాని, అన్యథా కారాదు. అం తియగాక, అన్యమతములను సహనముతోడను సదభిప్రాయ ముతోడను చూచునట్టి బుద్ధియు, ఈదేశమున వృద్ధియగు చున్నదనుటకును చిహ్నములు గన్పట్టుచున్నవి. నా యనుభ వములోపల నేను జూచినంత వఱకు మతబోధలేనివిద్య నిష్ప్ర యోజనమని నా దృఢాభిప్రాయము. ఈవిశ్వవిద్యాలయ స్థాప నోత్సవమునకు తోడ్పడునట్లు మిమ్మందఱ ప్రోత్సాహపఱచినది యు నిట్టి యభిప్రాయమే. హిందూమతాచారములతోడను సాంప్రదాయములతోడను నాగరకతతోడను నిబిడీకృతమై యున్న గుణరత్నము లన్నియు - నీ విశ్వవిద్యాలయమును

పోషించి పెంపొందింపవలెననియు, పాశ్చాత్య ప్రకృతిశాస్త్ర మునను పరిశ్రమలయందును వివిధ విద్యాలయములయందును గల సోపయుక్త సద్విషయముల నిందు మిళితముచేసి మీాసం తతివారిని సత్ప్రవర్తనగల మతాభిమానులుగఁ జేయుటయే గాక హిందూదేశముయొక్క సంపదను నవీనపద్ధతుల ననుస రించి యభివృద్ధి జేయుట కవకాశముగలవారినిగఁ జేయవలెనని యు మీారు తలంచుచున్నారు. ఇదియెంతయు శ్లాఘనీయము."

## గంగాప్రవాహ నిర్బంధము.

హిందూవిశ్వవిద్యాలయ స్థాపనమున హిందూప్రజా నాయకులకుఁ దోడ్పడి హార్డింజి ప్రభువర్యుఁడు హిందువుల కృతజ్ఞతకెట్లు పాత్రుఁడయ్యెనో, అటులనే మఱియొక ముఖ్య విషయమునందును హిందూమతాభిమానుల స్వాభిమానభావ మును గారవించి స్తుతిపాత్రుఁడయ్యెను. హిందూపుణ్యక్షేత్ర మగు హరిద్వారమువద్ద గంగానదిని నిరాఘాటముగఁ బ్రవహిం పనియ్యక నూతనముగ నానకట్ట కట్టించుట కధికారులొకవిధా నమేర్పఱచిరి. తామెంతో పావనముగ నెంచి పూజించు పుణ్య నదియగు గంగయొక్క ప్రవాహము నశ్యమగునని హిందువులు వినఁగనే హిందూప్రపంచమునం దాందోళన ముద్భవించెను. ఈ హార్డింజి ప్రభువర్యుని పితామహుఁడగు హార్డింజి రాజప్రతి నిధి కాలముననే, ఈగంగానదినుండి పంటభూముల పాఱుదలకై గొప్పకాలువత్రవ్వించుట పూర్తియైనది. ఆకాలువ పారుదల

వలన నాప్రాంతవాసులగు లక్షలకొలఁది జనులకు జీవనాధారము కలుగుటయేగాక ప్రభుత్వమువారికిని లాభకరమైన వరుంబడి వచ్చుచున్నది. హారిద్వారమువద్ద సుమారు 70 సంవత్సరముల క్రిందట గంగానదికొక ఆనకట్ట కట్టించిరిగాని దానంజేసి హిమాలయపర్వతమునుంచి ప్రవహించు నదీజలంబున కేలాటి నిరోధములేదు. ఇప్పటివిధానమున పైనుండివచ్చు ప్రవాహమున కడ్డుకలుగు నట్లుండెను. హార్డింజిప్రభువర్యుఁడు లోఁగడ కాన్పూరు మసీదువ్యవహారములో జోక్యపడి మహమ్మదీయుల మతాభిమానమును గౌరవించినట్లే ఈవిషయమునందును బనిపూని ప్రవాహము నిరాఘాటముగ పాఱునట్లు విధానాంతరము మార్చి 70 సంవత్సరములనుండి యుండిన ఆనకట్ట సహితము విస్తరింపంజేసి హిందువులకు చిరస్మరణీయులైరి.

## హార్డింజిగారి శిలాప్రతిమ

ఈరాజప్రతినిధియందు ప్రజలకుగల గాఢానురాగమును వెలిబుచ్చుటకై 1915-వ సంవత్సరము సెప్టంబరునెల 27-వ తేదిన సిమ్లానగరమున హార్డింజిప్రభువుయొక్క స్మరణచిహ్నముగ వారి శిలాప్రతిమ యొకటి శాసననిర్మాణసభాభవనమున నెలకొల్పఁబడినది. ఈశాసనసభా భవనము హార్డింజిప్రభువు పరిపాలనా కాలముననే ప్రారంభించి పూర్తిసేయఁబడినది. కావున నాభవనము నలంకరించు ప్రథమప్రతిమ ప్రజానురంజకుఁడగు హార్డింజిప్రభువు ప్రతిమగానుండుట యెంతయు సమంజసమ

కాశింబజారు మహారాజావారు దృఢాభిప్రాయులై ఆప్రతిమను సిద్ధముసేయించెను. దానిని సభాభవనమున నెలకొల్పుటకైన మహాసభకుఁ బ్రజానియుక్తసభ్యులును, దేశభక్తాగ్రగణ్యులును నగు పండిత మదనమోహనమాలవ్యగారధ్యక్షతవహించి ప్రతిమాప్రతిష్ఠ గావించిరి. అపుడు మాలవ్యగారు హార్డింజిపరిపాలనముంగూర్చి విపులముగ నుపన్యసించి హార్డింజిప్రభువయ్యెడు ప్రజాసేనాయత్తచిత్తులై ప్రఖ్యాతిగాంచిన క్యానింగ్, రిప్పన్, ప్రభువ్రలతో సమానమైన రాజప్రతినిధియనియు, దర్బారు ప్రకటనములలో వారు ప్రచురముచేసిన మార్పులును, హిందూదేశమునకు స్వపరిపాలనమును ప్రసాదించు మార్గమును సూచించుచు ఆంగ్లప్రభుత్వమువారికి వారు వ్రాసినలేఖయు, వారొనర్చిన యితర ఘనకార్యములును, వారి యౌదార్యభావములను క్రియారూపమున స్పష్టపఱచినపనియు నొక్కి వక్కాణించిరి.

## సిమ్లానగరవాసుల వీడ్కోలువు

సిమ్లానగరమునందీప్రతిమయొక్క స్థాపనయేగాక, ఈనెలలోనింక నెన్నియోవిందులను, వేడుకలను పురజనప్రముఖులుగావించి హార్డింజిప్రభువుయొక్క ప్రజానురాగ వశీకరణమును వెల్లడించిరి. సెప్టంబరునెల 29-వ తేదిన రాజప్రతినిధిగారికి హైందవులు జరిపిన గొప్పవిందులో ప్రజలపక్షమున రాజాహరినామసింగ్‌గారు శ్రీయుత సాభినందన పత్రమును

సమర్పించి వారిని కొనియాడిరి. ఆవారమునసే యునై టెడ్ సర్వీస్ క్లబ్ వారొక విందుచేసిరి. అపుడు ఆంగ్లోద్యో గీయులనేకులు సమావేశమైరి. వారి అభినందనముల నందుకొని ప్రత్యుత్తరమిచ్చుచు హార్డింజి ప్రభువర్యుఁడు వారికిట్లు హితోప దేశము చేసెను. "ఆంగ్ల దేశీయ పరిజ్ఞానమును నాగరకతను వీనివలన జనించు స్వాతంత్ర్యాభిలాషను సాభిమాన గౌరవ మును, హిందూదేశీయుల హృదయములందు పాదుకొనునట్టు లాంగ్లదేశము చేసినది. ఇపుడు హిందూదేశమున బాహ్యదృ గ్గోచరములగు జడపదార్థములంగూర్చి మాత్రము విచారించినఁ జాలదు. తాము నాటిన బీజముయొక్క ఫలములని చెప్పఁదగు హైందవాదర్శముల నాంగ్లులు గమనించు టత్యవసరము. ఇంతవఱకు తమపూర్వీకులగు ఆంగ్లదేశీయు లీదేశమునకు చేసిన సేవ శ్లాఘనీయమైనదగుట యటుండ, మున్ముందు హిందూదేశీ యాభివృద్ధికై జరుగనున్న మార్పులలో హైందవులకుతోడ్పడి సరియైన మార్గములలో వారు నడచుటకు త్రోవచూపుట యందింకను ఘనతరమగు సేవజేయుట పరమధర్మమని, ఆంగ్లో ద్యోగీయు లిప్పుడిపుడు క్రమేణ గ్రహించుచున్నారు. మీరు వారికి నూతన మార్గములయందు స్నేహభావముతో మంచి దారిచూపి వారిని దక్షులుగా శిక్షితులంజేయుట యందెంత కృషిసల్పినను శ్లాఘనీయముగ నుండును. హిందూదేశీయా దర్శములను గ్రహించి వానిపై సానుభూతితో మెలంగవలయును.

కాలక్రమమున మీ యధికారములను కొన్ని వదలుకొని హైందవుల కిచ్చితీరవలయును. అయినను, స్వార్థత్యాగబుద్ధితో నదిసహించి హైందవులను స్వపరిపాలనార్హులనుగాఁజేయుట యందు వారికి తోడ్పడు ఘనకార్య మొనర్పవలసినది. హైందవాదర్శములు త్వరలో ఫలించునని నే జెప్పఁజాలను. ఈకార్య సాఫల్యమునం దెన్నియో యాటంకములు గలుగవచ్చును. అయినను, ఈ యాదర్శసిద్ధినే, ఆంగ్లోద్యోగీయులు దృగ్గోచరమునం దుంచుకొనవలయును. ఈ కార్య సాధనమున మునుముందు మీ రెట్లు విజయమునుగాంచుదురో దానింబట్టియే ఆంగ్లులప్రతిష్ఠయు, సమరతయు, తీర్మానింపఁబడునను నంశమును మీరు గ్రహించి తీరవలయును." ఈయుపదేశ వాక్యములను, ఆంగ్లోద్యోగీయులు మఱువకుందురుగాక.

## హార్డింజి గ్రంథాలయము

ఢిల్లీనగరవాసులు హార్డింజిగారి పేరిట నొకగ్రంథాలయమును స్థాపింపనెంచి 1916-వ సంవత్సరము మార్చినెల 16-వ తేదిన ప్రారంభ మహోత్సవమును జరిపిరి. నాంటి సభకు దేశభక్తులు, సర్ సి. శంకరనాయర్‌గా రధ్యక్షులుగ నుండి రాజప్రతినిధిగారి గుణగణములను వివరించుచు నుపన్యసించిరి.

## లిఖితపూర్వకదాస్యము

ఈ రాజప్రతినిధియొక్క పరిపాలనావసానకాలమున హిందూదేశీయ గౌరవమును భంగించు, లిఖితపూర్వకాదినినే

శ్యదాస్యపద్ధతి తీసివేయుటకు యత్నములు సలుపఁబడి రాజ ప్రతినిధిగారి సానుభూతివలన సఫలత నొందు భాగ్యముకలిగి నది. 1916-వ సంవత్సరము మార్చి 20-వ తేదిన సామ్రాజ్య శాసన నిర్మాణసభలో పండిత మదనమోహన మాలవ్య గారు హిందూదేశీయులను పాశ్చాత్యాధనివిష్టదేశములకుఁ గష్టవృత్తికై కొనిపోవుటయందుండు నిర్బంధ పద్ధతిని రూపు మాపుటకు ననతికాలమునం దగుచర్య పుచ్చుకొను డని, ఈసభవారు సచివ సర్వపాలకాధ్యక్షులకు ప్రణుతిసేయు చున్నారు." అను తీర్మానము నుపపాదించిరి. అధినివేశ్య దాస్యమునకైన లిఖిత పద్ధతియనఁగా:— పాశ్చాత్యాధని విష్టదేశములలోనున్న తేయాకు, చెఱుకు, మొదలగు తోట లలో కూలిపనిచేయుటకు గాను హిందూదేశము నుండి యా దేశములకు బో సమ్మతించువారిచేత, నచ్చటిభూస్వాముల కను కూలమైనరీతి మనవారు వర్తించునట్లు, పత్రము వ్రాయించు కొని తీసికొనుపోవు పద్ధతి. ట్రినిడాడ్ ఫిజిద్వీపములు, బ్రిటిష్ గయానా, డచ్ గయానా, నెటాల్ మున్నగు ననిధనివేశ రాజ్య ములలోని తెల్ల దొరలకు తోట లనేకములున్నవి. పూర్వము బానిసప్రవృత్తి ప్రచారములో నుండఁగా నాభూస్వాములు స్వలాభముకొఱకు నీచమైన బానిసప్రవృత్తి పాటించుచు బాని సలచేత స్వేచ్ఛమై నెట్టికార్యమునైనను జేయించుకొను చుం డిరి. ఈబానిసపు వ్యాపారము నిర్మూలమైన పిమ్మట, ఈలిఖిత

రూపదాస్య పద్ధతిం బన్నిరి. ఇది సుమారు 80 సంవత్సరముల క్రితమారబ్ధమైనది. పూర్వము బానిసలుగానున్న నీగ్రోజాతివారు సహితము తాము బానిసతనమునుండి విముక్తులైన పిమ్మట లిఖిత పూర్వకదాస్య పద్ధతి తిరస్కరించఁగా నాగరికులై ప్రాచీన కాలమునుండి స్వేచ్ఛ ననుభవించుచుండిన భారతీయు లీ క్రూరపద్ధతికి సమ్మతించునట్లు మాయోపాయములు బన్నిన తెల్లదొరల సాహసము నెంతదూరినను దోషములేదు. వారి పన్నుగడకు విద్యావిహీనులును, అమాయకులును, అసహాయులును, అజ్ఞానులును, బీదవారును నగు భారతీయు లనేకులు లోఁబడిరి. తాము సంతకముచేయు పత్రములోనున్న సంగతులేమో వారికిఁ దెలియవు. అధినివేశ రాజ్యముల స్థితిగతులుగాని, తమయజమానుల క్రూరచర్యలుగాని, తమరు చేయవలసిన పనులుగాని, విమర్శగా వారికి దెలియవు. ఈకూలీల నచ్చటచ్చట ప్రోగుచేయు దలారులను నియమించి వారికా దొరలు ధారాళముగా ద్రవ్యమిచ్చుచుండిరి. ఈద్రవ్యమునకాసపడి దేశద్రోహులై దలారులు మనుజులమోసముచేసి మంచి నౌకరుల నిప్పించెదమనియు, యెక్కువగా ద్రవ్యము సంపాదించ వచ్చుననియు లేనిపోని మాటల నమ్మఁబల్కి పత్రములలో సంతకములు పెట్టించి కృత్రిమముగ వారి నధినివేశ రాజ్యములకు బ్రయాణము చేసిపంపుదురు. ఈకూలీల నంపునపుడు 100 కి 40 మంది స్త్రీలుగా నుండ

వలయునను నియమము గలదు. కనుక స్త్రీలను సహితము దలారులు పైవిధముగనే మోసముచేసి పంపుచుందురు. మర్యాదగల స్త్రీ లీవృత్తికి దొరకరు గనుక వారి వలలోఁ జిక్కు స్త్రీలు చెడునడవడిక కలవారుగను భర్తలను వదలిపెట్టిన వారుగను నుందురు. కొందఱు యాత్రలకై పోవుచు దారిదప్పి దలారుల పాల్పడినవారును గలరు. ఈ కూలీ లన్నిదేశరాజ్య ములలోఁ జేరినది మొదలు, అనిర్వచనీయములగు కష్టములకులో నగుచున్నారు. అచ్చటవస్తువులధరలు చాల ప్రియముగనుండును. వీరి కిచ్చునట్టికూలి యుదరపోషణమునకును, వస్త్రములకును చాలదు. మఱియొక విధముగ సంపాదించుకొనుటకు వీలులేదు. యజమాని, ఎట్టిక్రూరకార్య మొనర్చినను వీరి మొఱలాలకించు వారు లేరు. కూలీలలో మగవారికిగాని ఆడువారికిగాని, సక్రమ వివాహబంధము, అరుదు. జారత్వము పరమతము. ఈదుష్ప్ర వర్తనలవలన వారు దేహారోగ్యము చెఱచుకొని అకాలమరణ ములకు లోనగుచున్నారు. కొందఱు తమయజమానులు పెట్టు బాధలను సహింపఁజాలక మాతృదేశమునకు పాఱిపోవ నుద్య మించి, తమకున్న చోటికిని మాతృదేశమునకును మధ్య మహా సముద్రమున్నదని తెలిసియు, నేదోయొక భూమార్గమున పోవ చ్చునేమో తెలిసికొని పోవుదమని నడచి పోవుచుండగా, నిర్బం ధముగ వెనుకకు మరలింపఁబడుటయు లేక అడవిమృగముల పాలబడుటయు లేక క్షుత్పిపాసలచేతను, శీతోష్ణాధిక్యముల

చేతను, మృతినొందుటయు, సంభవించుచున్నది. కొలఁది నేర ములకు సహితము క్రూరమగుదండనము విధింపఁబడుచున్నది. ఈబాధల భరింపనేరక మార్గాంతరము గానక మనోవ్యాధి చేత, నిరంతరదుఃఖభాజనులై యనేకు లాత్మహత్యలకుఁ బాల్పడుచున్నారు. వీరిలో మరణసంఖ్య నానాఁటికి భయంక రముగ నున్నదని రాజ్యాంగమువారే యొప్పుకొనియున్నారు. ఈ యనర్థములకంతకును కారణము స్వేచ్ఛకు భంగకరమైన లిఖితపూర్వకదాస్య పద్ధతియే. ఈ పద్ధతి దూష్యమైనదని కర్జన్ ప్రభువు మున్నగు నాంగ్లప్రముఖులు నుడివి యు న్నారు. మరియు గంధిమహాశయుఁడు, పై పద్ధతి ఆచరణమం దున్నంతకాలము హైందవ జాతికంతకు గౌరవభంగముగ నుండునని, యిందలి దుస్సహదౌర్జన్య ప్రాబల్యమును పలు మారు పలువిధముల లోకమునకు ప్రకటించియున్నాఁడు. కీర్తి శేషులగు శ్రీయుత గోపాలకృష్ణ గోఖలేగారును, నీపద్ధతిని నిర్మూలముచేయ కృషిసల్పియున్నారు. వారి కృషివలన 1910-వ సంవత్సరము నెటాలుకు కూలీల నంపు పద్ధతి మాత్ర మాపివేయబడి 1911-వ సంవత్సరము జూలై నెం 1-వ తేదినుండి యాచరణలోనికి వచ్చినది. 1912-వ సంవత్సరమున, గోఖలేగారు మరల నొక తీర్మానమును సభలో నుపపాదించి ఈపద్ధతి నితరాధనివేశ దేశములలో సైతము మాపుమాప యత్నించిరిగాని రాజ్యాంగమువారు సమ్మతింపక పోయిరి.

ఇపుడు మాలవ్యగారు తీర్మానమునే మరల నుపపాదించుచు "ఈపద్ధతిని సంస్కరించి ప్రయోజనము లేదనియు, నిర్మూలము చేయుటయే సంస్కరించుటయనియు, బానిసతనమును నిర్మూలముచేయుటకు 25 లక్షల పౌనులు వ్యయముచేయుటకు సమ్మతించినట్టియు, నల్లమందునలన వచ్చెడి వచ్చుబడిని స్వార్థత్యాగముతో బోగొట్టుకొని, నల్లమందువలనం గలుగుచుండిన చెడ్డగుణములనుండి చీనాదేశస్థులను రక్షించుటకు సమ్మతించినట్టియు, నుదారహృదయులగు ఆంగ్లపరిపాలకులు కేవలము నిచమైనట్టియు దుర్నయబంధురమైనట్టియు, నిర్బంధదాస్యపద్ధతిని నాశనముచేయుడని వేడుకొను మామొరలను తప్పక ఆలకించెదరనియు నేను నమ్ముచున్నాను." అని ఖండితముగ నుద్ఘోషించుచు దీర్ఘోపన్యాసము నొసంగిరి. హార్డింజి ప్రభువర్యుడు, చాలవఱకు మాలవ్యగారి యభిప్రాయముతో నేకీభవించి యుండుటచే, ముందుగా తాను హిందూదేశమంత్రిగారి సమ్మతినిపొంది, ఆంగ్లరాజ్యాంగమువారు మాలవ్యగారి తీర్మానమందలి యభిప్రాయముతో నేకీభవించిరిగనుక, తామీ తీర్మానమును అంగీకరించెదమనిరి. ఆంగ్లరాజ్యాంగము వారు సమ్మతించునట్లుచేసిన రాజప్రతినిధియగు హార్డింజిప్రభువర్యుని నిష్కపట హైందవాభిమానమునకు హైందవసభ్యులు వారిని సంస్తుతించిరి. అధినివిష్టరాజ్యములలోనున్న భారతీయులును నీవార్తవిని సంతోషభరితాంతరంగులైరి. ఈ తీర్మాన మంగీ

కృతమైన తత్క్షణమే యధినివేశరాజ్యాధిపతులతో నాంగ్ల రాజ్యాంగమువారు త్తరప్రత్యుత్తరములు జరుపుటకారంభించిరి. అధినివేశ రాజ్యములవారు చాలమట్టుకు హైందవాభిప్రాయమున ననుకూలముగ మార్పులుచేసిరిగాని, యింకను సంకటములున్నటులే తెలియవచ్చుచున్నది.

## విద్యావ్యాపకాభిలాష

హిందూదేశ మభివృద్ధిగాంచుటకు ప్రజలు విద్యావంతులైనగాని యే సంస్కరణమైనను ఫలము నియ్యంజాలదని హార్డింజిప్రభువు గ్రహించి విద్యావ్యాపనమునకై తనపరిపాలనా కాలమున నెక్కువ ద్రవ్యము వెచ్చించెను. ప్రారంభ విద్యాభివృద్ధికై ప్రతిసంవత్సరము 50 లక్షలరూపాయలు అధికముగ వ్యయముచేయునటు లేర్పాటు చేయుటయేగాక, ఉన్నత విద్యాభివృద్ధికిని, పలువిధముల తోడ్పడెను. నూతన విశ్వవిద్యాలయములు స్థాపించుటకు యత్నములు సలుపంబడెను. విద్యార్థులయం దెక్కువ ప్రేమను గనుపఱిచి హార్డింజిప్రభువు, అవకాశము గలిగినపుడెల్ల వారికి హితబోధచేసెను. 1912-వ సంవత్సరము మార్చినెల 16-వ తేదిన కలకత్తానగరమున హార్డింజిగారి యాజమాన్యమున జరిగిన విశ్వవిద్యాలయ సాంవత్సరికోత్సవమున స్నాతకులకు హితబోధం జేయుచు, ఉన్నతవిద్యంగూర్చియు విశ్వవిద్యాలయములోని మార్పులం

గూర్చియు, నుపన్యసించి "ఇది నా అంత్యోపదేశము. మీదే వుని యెడల న్యాయ్యముగ వర్తింపుడు. మీచక్రవర్తియెడల న్యాయ్యముగ వర్తింపుడు. మీదేశముయెడల న్యాయ్యముగ వర్తింపుడు. మీ ఆత్మయెడల న్యాయ్యముగ వర్తింపుడు. అట్లు ప్రవర్తించితిరేని మీకు భయములేదు. మీదేశము యొక్క భావిస్థితికిని భయములేదు." అను వాక్యరత్నములం బలికిరి. మరియు, ఆసంవత్సరము డిశంబరునెల 5-వ తేదిన భోపాలునగరమున హామీడియా గ్రంథభాండాగారము యొక్క ప్రతిష్ఠాపనోత్సవము జరుపుచు "నాపరిపాలనా కాలమున నే చేయదలంచిన ముఖ్యకార్యములలో ప్రారంభవిద్యను వ్యాపింపఁజేసి భారతీయులలో మిక్కిలి బీదవారికి సహితము విద్య నందఁజేయుటకు విధానము నేర్పఱచు నభిలాషయే నాహృదయమునం దగ్రస్థానము నాక్రమించి యున్నది" అనిచెప్పిరి. కలకత్తా విశ్వవిద్యాలయమునకు మరల 1915-వ సంవత్సరము మార్చినెల 6-వ తేదిన స్నాతకుల కుపన్యసించు భాగ్యము వీరికి లభించినది. అపుడు విద్యార్థులు కళాశాలలలోనేర్చుకొన వలసిన గుణగణములను విశదీకరించి పేర్కొనిరి. వీరిపాలన మున విద్యనేర్చుకొనువారి సంఖ్య హెచ్చినను ప్రారంభవిద్యకై ఎక్కువగ ద్రవ్యము వెచ్చించినను వారికోరిక నెరవేరినది కాదు. ప్రారంభవిద్య నిర్బంధపూర్వకమై యుండినయెడల వారింకను నెక్కుడు సంతసించి యుందురు.

## ఇతర సత్కార్యములు

ఈపరిపాలనమున ప్రజాస్వామికమున కనుకూలమగు సంస్థలు కొన్ని నెలకొల్పఁబడినవి. మధ్యపరగణాలకు ఆసాముకు, శాసననిర్మాణసభలు నిర్మింపఁబడినవి. బేహారురాష్ట్రమునకు కార్యనిర్వాహకసభ విధానించుటయేగాక, శాసన నిర్మాణసభ ప్రతిష్ఠితమై అందు ప్రజానియుక్తులైన వారిసంఖ్య హెచ్చుగనుండునట్లు చేయబడినది. పాట్నానగరమున నూతనముగ గరిష్ఠన్యాయస్థానము (హైకోర్టు) స్థాపింపఁబడినది. మరియు నచ్చటనే విశ్వవిద్యాలయ స్థాపనమునకును యత్నములు జరిగి త్వరలో సఫలము గానుండెను. పంజాబు రాష్ట్రమునకు గరిష్ఠ న్యాయస్థాన ప్రతిష్ఠాపనమునకై ప్రణుతిచేయఁబడెనుగాని కొనసాగలేదు.

## కడపటి సభాసమావేశము

1916-వ సంవత్సరము మార్చినెలలో ఢిల్లీనగరమున జరిగిన శాసననిర్మాణసభయే వీరి యాజమాన్యమున జరిగిన కడపటిసభ. ఈసమయమున నొసఁగిన యుపన్యాసము చదివి యానందింపవలయునే గాని ఆంగ్లమునందుండు నాయుపన్యాస ధోరణినిగాక, వారినిష్కల్మషములైన భావములను, హిందూదేశాభిమానమును, ఈదేశమును ఇందలి మిత్రులను వదలుటకు వారుపడిన పరితాపమును, భాషాంతరీకరణమునం బ్రయత్నించుట వ్యర్థప్రయత్నము. అందు పరిపాలనయందు వారో

నర్పుఁగలిగిన మార్పులను సూచించిరి. హైందవాదర్శములను చక్కఁగ విశదీకరించిరి. హైందవులకు హితోపదేశము చేయుచు సక్రమాభివృద్ధికై యత్నింపుఁడని స్నేహవాక్యములం బలికిరి.

## ఉపన్యాసముల ప్రభావము

హార్డింజి ప్రభువుగారు శాసననిర్మాణ సభలలోనేమి, సాంఘికసభలలోనేమి, వారి పర్యటనములలోనేమి, యొసంగిన యుపన్యాసములు ప్రజల మనముల నాకర్షించుచు, దృఢవిశ్వాసమును, గౌరవమును, భక్తిని, ప్రేమను, వారిపై శ్రోతలకు సంపూర్ణముగఁ గలుగునట్లు విస్పష్టముగను, గంభీరముగను మృదువుగను నుండు సామర్థ్యముగలవై గణన కెక్కియున్నవి. ఇదివఱకుండు రాజప్రతినిధులవలెఁగాక వీరు విదేశ రాజనీతి యందు నిపుణులు కాన శాసన నిర్మాణసభలలో విదేశరాజనీతిని గుఱించియు హిందూదేశమునకును విదేశములకును గలసంబంధములను గుఱించియు, సభ్యులకు నివేదించుచుండిరి. ఈవిషయమున వీరి యుపన్యాసము లసాధారణములైనవని చెప్పనొప్పును.

## ప్రజలకు వారిపైఁగల ప్రేమ

వారి యుపన్యాసముల వలనను, చేతలవలనను వారివలె హైందవుల శ్రేయోభివృద్ధి నభిలషించినవారును, స్వాతంత్ర్యములఁ గాపాడఁ దలంచినవారును, నూతన తేజములను

బుద్ధికొల్పఁ గలిగినవారును మఱియొక రాజప్రతినిధి, ఈభరత ఖండమున కింతవఱకు రాలేదనియే చెప్పనొప్పును. హిందూ దేశపు రాజప్రతినిధుల కెవరికిని బ్రజలు మనఃపూర్వకముగ జన్మ దివసోత్సవము జరిపి యుండలేదు. సాధారణముగ నెచ్చటనైనను జక్రవర్తుల యొక్కయు రాజుల యొక్కయు వర్ధంతులు జరుగునే కాని రాజప్రతినిధుల కా గౌరవము లభించు చుండుట వినము. కాని హార్డింజి ప్రభువుగారి జన్మదివసోత్సవము మిక్కిలి వైభవముతో హిందూదేశమందెల్లఁ బట్టణములనే కాక పల్లెలయందును జరుగుటయే వారియందుఁ బ్రజలకుఁ గల సదభిప్రాయములకును, ప్రేమకును, ప్రబల నిదర్శనము.

## మాతృదేశ ప్రయాణము

ఈ విధముగ హార్డింజిప్రభువు 5½ సంవత్సరముల కాలము హిందూదేశమును రాజప్రతినిధిత్వ పదవిని ప్రజానురంజకముగ నిర్వహించి మాతృదేశ ప్రయాణ సంసిద్ధుఁ డయ్యెను. తే 25-3-1919 దిన రాజప్రతినిధి గారికి ఢిల్లీపుర ప్రముఖులు యావద్భారతీయపక్షమున వీడ్కోలువిన్నపము సమర్పించుచు నిట్లు చెప్పిరి. "హిందూదేశ రాజప్రతినిధు లందఱిలో రిప్పన్ ప్రభువు తర్వాత మీరే మిక్కిలి ప్రసిద్ధి కెక్కిన రాజప్రతినిధులని మీకభివాదనము లర్పించుచున్నారము. కష్టమైన మీయుద్యోగపు ధర్మముల నెరవేర్చుటయందు మీకు సంభవించిన

మహదాపదలను తాపత్రయములను స్మరణకు దెచ్చుకొనిన మాకెంతయు దుఃఖము కలుగుచున్నది. ఆకష్టదినములలో భారత జనమండలి యంతయు ననాలస్యముగను, మనఃపూర్వకముగను, తన సానుభూతిని దెలియఁజేసినది. ఎవ్వరికై మీరింత ప్రేమనుఁజూపి, ఎవరిశ్రేయోభివృద్ధికై యింతకాలము కృషి సల్పితిరో, అట్టి ఈప్రాచీన భరతఖండముయొక్క నివాసుల పురోభివృద్ధికై మీరెచ్చట నున్నను పాటుపడుదురని మాకు దృఢవిశ్వాస ముండినను, పరిపాలకాధికారవిధముగా మీరు మమ్ము వదలిపోవుటయు హిందూదేశ చరిత్రలో నత్యున్నతమై ప్రకాశవంతమగు స్థానము నొందిన మీరాజప్రతినిధిత్వ పరిమితికాలము, త్వరలో ముగియనుండుటయు, తలంచుకొనిన మాకు మిక్కిలి వ్యసనము కలుగుచున్నది. మీకాయురారోగ్యముల నొసంగి చిరకాలము సుఖంబుగనుండ ననుగ్రహించు గాకయని దేవదేవుని ప్రార్థించుచున్నారము." ఈవిజ్ఞాపనపత్రిక నంది ఢిల్లీపురజనుల సెలవుగైకొని అచ్చటినుండి ప్రయాణమై బొంబాయి నగరముం జేరిరి. బొంబాయినగరమునందనేక ప్రజాసంఘములు హార్డింజిప్రభువర్యుని లేవిధముల గౌరవించినవి. బొంబాయి విశ్వవిద్యాలయమువారు హార్డింజి ప్రభువుగారికి యల్. యల్. డి. యను బిరుదునొసంగి సన్మానించిరి. (స్మృతిసార్వభౌముడు) డాక్టర్ ఆఫ్. లా యను ఈబిరుదు ఈ విశ్వవిద్యాలయ స్థాపనమైనదిమొదలు 5 గురు మహనీయు

లకు మాత్రమే యొసంగఁబడి యుండుటవలనఁ ఈబిరుదునం దుట మహోత్తమ గౌరవముగ నెన్నబడును. ఇదివరలో నీగౌరవము ప్రజానురంజకముగ పాలనజేసిన మరియొక రాజ ప్రతినిధియగు రిప్పన్ ప్రభువునకు సుమారు 32 సంవత్సర ముల క్రిందట అబ్బియుండెను. నేఁడు హార్డింజి ప్రభువునకును అట్టి సన్మానము జరుగుట యెంతయు సమంజసమని విశ్వ విద్యాలయాధికారులు తలంచిరి. హిందూదేశములకు సింహ ద్వారమని చెప్పందగిన ఈబొంబాయి నగరమందలి పౌరసంఘ మునకు హిందూదేశమునకు వచ్చు రాజప్రతినిధికిని పోవురాజ ప్రతినిధికిని స్వాగత మిప్పించు భాగ్యముగలదు. కావున కడపట బొంబాయి పట్టనపాలక సంఘము వారి వీడ్కోలు గైకొని ఏప్రిల్ నెల 4 న తేదిన హార్డింజి ప్రభువు మాతృదేశోన్ముఖులై ధూమనౌక నెక్కి ప్రయాణమైరి.

## ఇంగ్లాండులో చేరుట

వారు ఇంగ్లాండు చేరవచ్చిన్నంత స్వక్రమమర్యాదలుండ ప్రభువుల సభలో నుచితాసనాసీనులైరి. పరిపాలనా భార ముచు హిందూదేశములో మిగుల సామర్థ్యముతో నిర్వహిం చిన, ఈమహనీయున కక్కడమాత్రము విశ్రాంతికుదురునెట్లు? యుద్ధకాలమున తామూరకుండుట ధర్మము కాదని యెంచి ప్రభుత్వమువారే పనికి నియమించిన సద్దాని మనఃపూర్వక

ముగ జేయుచుండిరి. విదేశరాజ్యాంగ శాఖలో బాధ్యతాధికారోద్యోగమునకు వారిని ప్రభుత్వమువారు నియమించగా నద్దాని నిర్వహించు చుండిరి. ప్రభువులసభలో సభ్యులుగనుక, అచ్చట హిందూ దేశమునకు సంబంధించిన చర్చయేదైన వచ్చిన యెడల నందుపాల్గొనుచు హైందవా శయముల గాపాడుచు హిందూదేశీయానుభవములను జక్కగ వినియోగించుచున్నారు.

## మెసపొటేమియా వ్యవహారము

హార్డింజి ప్రభువుగారు ఇంగ్లాండుకు పోవునప్పటికే హిందూ పరిపాలనా కాలమున మెసపొటేమియా యుద్ధరంగమున సంభవించిన కొన్ని అపజయములం గూర్చి ప్రశ్నోత్తర చర్చలు జరుగుచుండెను. కట్ అను స్థలమువద్ద అపజయము కలుగుటకు గారణము లేమియని, ఆంగ్లదేశీయులు చర్చించుచుండిరి. హార్డింజి ప్రభువును, హిందూదేశ సేనాధిపతియు, యితర సైనికోద్యోగియులును, తగు జాగరూకతతోడను, నేర్పరితనముతోడను, తమ కార్యభారమును నిర్వహించి యుండిన, నాంగ్ల సేన కాపజయము సంభవించి యుండదనియు, సకాలమునకు యుద్ధరంగమునకు తగినంత సేననుగాని సేనకు దగినంత యుద్ధసామగ్రిని గాని పంపలేదనియు, వైద్యసహాయ శాఖవారు వస్తుసామగ్రిని సిద్ధముచేసి కొనక చాలమంది సైనికులకు సకాలములో చికిత్స సలుపక వారిని వెతలపాలుచేసి రనియు, ఈ విషయమై విచా

రించి నిందార్హులైన వారిని శిక్షింపవలయుననియు, ఇంగ్లాండు లో నాందోళనము జరిగెను. సత్యాసత్యముల నారయుటకై యాంగ్లమహాజనసభవారు, 1916-వ సంవత్సరము ఆగష్టు నెలలో విచారణకర్తల నియమించిరి. ఈసభకు జార్జి హామిల్టన్ ప్రభువు, అధ్యక్షులు; డనమూర్ ప్రభువు, శెసిల్ ప్రభువు, అడ్మిరల్ బ్రిడ్జి, జనరల్ లిట్టిల్టన్, కమాండర్ వెడ్జివుడ్, అనువారు సభ్యులు. వీరు సాక్షివిచారణచేసి, సాధనముల పరిశీలించి తమనివేదికమును 1917-వ సంవత్సరము జూన్ 26-వ తేదిన ప్రచురించిరి. ఈనివేదికమునకు, కమాండర్ వెడ్జివుడ్‌గారు భిన్నాభిప్రాయులై ప్రత్యేక నివేదికమును పంపుకొనిరి. వెడ్జివుడ్‌గారు హార్డింజిగారిపై నెక్కుడు దోషములను మోపి వారు పరిపాలన కనర్హులని నిందించిరి. తక్కినవారు వారితో నేకీభవించక, ఉద్యోగస్థులందఱియందును తప్పిదములున్నవనియు, హార్డింజిగారిని మాత్రమే నిందించుట, అధర్మమనియు ఈ అపజయమునకు యుద్ధరంగముననున్న సైనికాధిపతులును, సైన్యాఖానైపతులును, ఎక్కువ బాధ్యులనియు, వారు తీర్మానించిరి. హార్డింజిగారు సాక్ష్యమిచ్చిన దినమున వెడ్జివుడ్‌గారు సభకురాలేదు. హార్డింజి ప్రభువు తనపై మోపఁబడిన, అపనిందకు, ప్రభువులసభలో నిట్లు ప్రత్యుత్తరమిచ్చిరి. "కమాండర్ వెడ్జివుడ్‌గారు, నాపరిపాలనము గూర్చి దూషించుచు నివేదికమున వ్రాసియున్నారు. నేను సాక్ష్యమిచ్చిన దినమున తాను సభకు

రాలేదనియు, నన్ను విచారించినయెడల తన యభిప్రాయముల నన్నియు నేను ఖండించియుండ వచ్చునేమో యనియు, తానే వ్రాసికొని యున్నాడు. ఇది ఎవరితప్పు? తాను మరల నన్నే దినమునకైనను పిలిపించి విచారించి యుండవచ్చును గదా! విదేశరాజ్యాంగ కార్యాలయమున నేను సిద్ధముగ నుందుననియు తన న్యాయస్థానమునకును నాకార్యాలయమునకును రెండు ఫర్లాంగులదూరము లేదనియు వెడ్జివుడ్‌గారికి తెలిసియే యున్నది. ఒక వేళ నన్ను పిలిపించక పోయినను .కాగితముపై ప్రశ్నల వ్రాసిపంపినయెడల ప్రత్యుత్తరము నిచ్చియుందును గదా! అట్లేమియును జేయక, నన్ను విచారించక, నాసమాధానముగైకొనక, నాపరిపాలనమును దూషించుట యేటిన్యాయమో యీసభవారికే స్పష్టమగుచున్నది. నేను 37 సంవత్సరముల నుండియు, ఆంగ్లప్రభుత్వసేవలో గౌరవముగా జరుపుకొంటిని. ఏలాటి అపనిందయు ననుభవించలేదు. అట్టి నాపై నీనిందను మోపి నందుకు నేను చాల దుఃఖించితిని. ప్రభువుల సభలో నేను సభ్యుడుగా నున్నందున, నీయపవాదములకుం దగిన ప్రత్యుత్తరమిచ్చి నా నిర్దోషిత్వమును సహేతుకముగ వెల్లడించుకొనుట కవకాశము కలిగెనేగాని అట్టి యవకాశము లేని వారికేమిగతి? విచారణకర్తల నివేదికమున నాయందు మోపిన తప్పులకు నేనిచ్చిన సమాధానము తగిన ప్రత్యుత్తర మిచ్చుచున్నదని మీరు గ్రహించగలరు. నాపరిపాలనమును గూర్చి

వ్రాసిన యపనిందకు హిందూ దేశీయులే సాక్షి. ఈయు నాటి
పాలనా నియమితకాలమును వృద్ధిఁ జేసిన ఆంగ్లమంత్రివర్గమే
సాక్షి. నాపరిపాలన మాశాభంగ మొనర్చెననియు, నేనసమర్థు
డననియు, నెడ్జివుడ్ గారు చెప్పుచున్నారు. ఇచ్చటివారు కొందఱీ
యభిప్రాయమును చెప్పినచాలను. నేను పాలించిన హిం
దూదేశ ప్రజలీ యభిప్రాయమును వ్యక్తీకరించిన మొదలు నేను
శిరసావహించి యొప్పుకొనియెదను. హిందూదేశమునుండి
ఎంతసైన్యమును ప్రోగుఁజేసి యుద్ధరంగములకుఁ బంపఁబడిన
దో గమనించక, ఈ నివేదికకర్తలు, ఆక్షేపణలు చేయుచు
న్నారని హిందూదేశీయు లనుకొందురని యిచ్చటివారు తలం
చుచున్నట్లు కనఁబడదు. ఫ్రాన్స్, ఈజిప్టు, తూర్పు ఆఫ్రికా,
దేశములలోని యుద్ధరంగములకు, ఈ మెసపొటేమియా సంగతి
ననుకొనక పూర్వమే, హిందూదేశమునుండి, ఎంత సైన్యము
పంపఁబడినదియు, ఆసైన్యముల తగిన సన్నాహములతో పం
పుటకు హిందూదేశమున సేకరించియున్న యుద్ధ సామగ్రియం
తయు సంపూర్ణముగ వ్యయపడియుండుటయు నివేదికకర్తలు
గమనింపలేదు. యూరోపు ఖండముకంటె మిక్కిలి పెద్దదియై
30 కోట్ల ప్రజలు కలిగిన భరతఖండమున వివిధభాగములలో
జరుగు వ్యవహారములను గమనించుచు, హిందూదేశ సరిహద్దు
లనుదాటి, ఇతరస్థలములలో నెచ్చటెచ్చట హిందూదేశసం
బంధమగు వ్యవహారము లున్నను గమనించు చుండవలసిన,

రాజప్రతినిధి, స్వయముగ ప్రతివిషయమును, పరిశీలించుటకు ఎట్లు సాధ్యముకాదో, ఆంగ్లప్రజ లూహింపఁజాలరా? రాజప్రతినిధి తనయుద్యోగీయుల యుపదేశముల నమ్మి పనిచేయ వలసి యుండును. యుద్ధరంగములందున్న సైనికోద్యోగీయుల వర్తమానముల విశ్వసింప వలయును. సైనిక శాఖాధికారుల విధానములలో నెక్కువ ప్రవేశించి విమర్శించిన యెడల నదియు ఆక్షేపణకరముగ నుండును. నేను హిందూదేశమంత్రిగారిని, సేనాధిపతులను, ఆలోచించియే ప్రతికార్యమును జేయుచుంటిని. నా తప్పేమియును లేదు." అని గంభీరోపన్యాసము నొసగి తాను నిర్దోషియని పలికెను. బాల్‌ఫర్‌మంత్రియు హార్డింజి ప్రభువు నిరపరాధియని ఘంటాపథముగఁ బల్కుచు, సహేతుకముగ వాదించెను. భారతీయుల కత్యంత ప్రియుఁడైన రాజప్రతినిధిపై మోపఁబడిన యపనిందకు హిందూదేశీయులు రోషావేశవశులై హిందూదేశమునందచ్చటచ్చట సభలుఁ జరిపి వారిపరిపాలన నెట్టివారును దూషింపఁజాలరనియు, బాల్‌ఫర్ మంత్రి పల్కిన ప్రతివాక్యమును హిందూదేశ మామోదించు చున్నదనియు నాంగ్లులకుఁ దెలియఁజేసిరి.

## ఉపసంహారము

ప్రకృతము హార్డింజి ప్రభువుగారు, ఇంగ్లాండునందే ప్రభుత్వోద్యోగమున నున్నారు. హిందూదేశీయ వ్యవహారములు పరిష్కరించుటయం దాంగ్లమంత్రి వర్గమువారు హార్డింజిప్రభు

స్రగాని సమపదేశమును గైకొనుచుందురు. వారు భారతీయుల యాశయములను బాగుగ గుర్తెఱింగి యున్నారు గనుక వారి కెపుడవకాశము దొరకినను మన కోర్కెల నాంగ్లులకుఁ దెలియ జెప్పుచుందురు.

శ్రీ హార్డింజ ప్రభువుకు, చిరాయురారోగ్యసంపదల నిచ్చి ఆంగ్లదేశము నందున్నను హైందవభూమి యందభిమానమును వదలక భారతీయుల శ్రేయోభివృద్ధికై పరిశ్రమచేయునటులు దయామయుఁడగు పరమేశ్వరుఁ డనుగ్రహించు గాత.



PRINTED AT THE INDIA PRINTING WORKS, MADRAS.

# ప్రకటిత గ్రంథములు.

| | | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|
| 1. | యుగంధర విజయము (నవల) | ... | 2 | 4 | 0 |
| 2. | రంగరాజు (నవల) | ... | 1 | 0 | 0 |
| 3. | ఇందిరా వసుంధరము (నవల) | ... | 0 | 10 | 0 |
| 4. | జగన్మోహిని (నవల) | ... | 0 | 10 | 0 |
| 5. | మంజుమతి (నవల) | ... | 0 | 12 | 0 |
| 6. | అమృతవల్లి (నవల) | ... | 1 | 4 | 0 |
| 7. | పద్మిని (నవల) | ... | 0 | 12 | 0 |
| 8. | ఐదవజార్జిచక్రవర్తి (జీవితము) | ... | 0 | 8 | 0 |
| 9. | రామతీర్థస్వామి యం. ఏ. ,, | ... | 0 | 8 | 0 |
| 10. | నివేదితాసోదరి ,, | ... | 0 | 8 | 0 |
| 11. | హార్డింజిప్రభువు ,, | ... | 0 | 8 | 0 |
| 12. | గోపాలకృష్ణగోఖలే ,, | ... | 0 | 8 | 0 |
| 13. | మహాదేవగోవింద రాణడే ,, | ... | 0 | 8 | 0 |
| 14. | రంగశతకము | ... | 0 | 1 | 0 |
| 15. | సింహాప్రభువు (అచ్చుగుచున్నది) | ... | 0 | 8 | 0 |

యం. ఆర్. కృష్ణరావు & కంపెని

నెల్లూరు.

S. Viswanadhareddy
Vice Secratary



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA124B129 |
| పుస్తకం పేరు | హార్దింజప్రభువు |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | B,II,97 |
| లేని పేజీలు | 25,26,45,46 |
| తయారు చేసినది | Afsar |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Susmitha |
| పరీక్ష చేసినది | haseema |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |